


జయజయ గృహలక్ష్మి స్త్రీ సఖీ! జయజయ లలితాంధ్ర! మధుర సారస్వతీమా!
జయజయ లలనా రత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయకల్యాణీ!

వ్యవస్థాపకులు :
డాక్టరు కే. యన్. కేసరి

ఎడిటర్ :
సి. సి. పున్నయ్య

# జాతీయ పునర్నిర్మాణము — స్త్రీలు

తిరువేంద్రంలో ప్రథమ అఖిల భారత కాంగ్రెస్ మహిళల మహాసభ శ్రీమతి ఇందిరాగాంధీ అధ్యక్షతన జరిగిన సందర్భమున ప్రధాని నెహ్రూపంపిన సందేశము, కేంద్రమంత్రి శ్రీ మొరార్జిదేశాయ్ ప్రారంభోపన్యాసము, శ్రీమతి ఇందిరాగాంధీ అధ్యక్షోపన్యాసము మహిళాభ్యుదయంతోబాటు జాతీయ పునర్నిర్మాణం దృష్ట్యా పరిశీలించ తగినవి.

పండిత నెహ్రూ తన సందేశములో భారత ఆదర్శాల సారము శాంతియుతమైనది, ప్రజాస్వామికమైనదే కాక విప్లవాత్మకమైనది కూడా కాబట్టి ఆయాదర్శాలను మనము అన్ని విధాల అనుసరించాలనియు, ఆదర్శలక్ష్యాలసిద్ధికి తాత్కాలిక విజయాలను సమకూర్చే హింసామార్గంకంటే పదిలమైన, శాశ్వతమయిన ఫలితములను, విజయములను సమకూర్చగల శాంతియుతమార్గము మేలైనదనియు, మహోన్నతమయిన అభ్యుదయ

అభివృద్ధులను సాధించుటకు ఉత్సాహంగాముందుకు నడువాలనియు వివరించారు. ఏ దేశమైనా ప్రజలు స్త్రీ పురుషులనే విచక్షణ కతీతంగా దీక్షాయుతమైన కృషి, త్యాగము, సేవ మున్నగు సద్గుణములతో పూనుకున్ననే పురోభివృద్ధి సుగమంకాగలుగుతుంది. ఓర్పుకలిగి జాతీయవిశిష్టత, సాంప్రదాయాల ననుసరించి న్యాయం, ధర్మం దృష్టిలో నుంచుకొని స్త్రీలు, పురుషులుకూడ సమానబాధ్యతలతో జాతీయశ్రేయో సౌభాగ్యములను రూపొందించాలి.

జాతీయ జీవితంలో స్త్రీ పురుషుల సమానత్వమును కాదనడం ముమ్మాటికి పొరబాటే. సామ్యవాదసమాజస్థాపనకు శ్రీ దేశాయ్‌గారు చెప్పినట్లు స్త్రీ పురుషుల సమానత్వము ఏర్పడాలి. అయితే సౌఖ్యదాయకమైన, శాంతి ప్రదమైన, పదిలమయిన ఆదర్శమానవసమాజ స్థాపనకు స్త్రీ పురుషులు పరస్పర సహకార సహాయములతో పూనుకోవాలి. స్త్రీ పురుషులిరువురు వాస్తవికతకు అనుగుణంగా సమానత్వమును అర్థంచేసికొని మంచి చెడ్డలను గుర్తించి కుటుంబసౌభాగ్యమునకు, సంఘశ్రేయస్సుకు అది వినియోగపడునట్లు వ్యవహరించాలి. ఎవరు యిందులో 'సమానత్వము'ను అపార్థం చేసికొని నియమబద్ధమైన జీవయాత్రను నిర్లక్ష్యం చేసినా ఫలితాలు వికృతంగా, విషమంకావచ్చును. జాతీయరంగంలో స్త్రీ పురుషులు తమతమ బాధ్యతలను సహజస్వభావాలకు, శక్తిసామర్థ్యాలకు, తెలివితేటల కనుగుణ్యంగా పంచుకొని పరస్పరము గౌరవించుకుంటూ నిర్వహించినచో యిందులో నెవ్వరికీ అధికార ఆదిపత్యవాంఛలు కలుగుట కవకాశముండదు. నియమబద్ధమైన సత్శీలముతో జీవయాత్ర కుపక్రమించిన పురుషులు స్త్రీలనుభయపెట్ట నవసరముండదు; స్త్రీలు పురుషులను చూచి భయపడవలసిన అవసరముండదు; దాంతోబాటు పరస్పర ద్వేష, క్రౌర్య, ఈర్ష్యాభావాలకుకూడ అవకాశముండదు. శారీరకంగా పురుషులు స్త్రీలకంటే బలవంతులే కావచ్చును. కాని పురుషులకులేని సద్గుణాలు, యోగ్యతలు, తెలివితేటలు, శక్తిసామర్థ్యాలు సహజసిద్ధంగా స్త్రీలకుగలవనునది నిర్వివాదాంశము. కాబట్టి స్త్రీ పురుషులలో నెవరు మరొకరికంటె ఘనులమనుకొని విర్రవీగినా పొరబాటే కాగలదు. సంఘవ్యవస్థను తారుమారుచేసి అల్లకల్లోలానికి దారితీయగల మనస్తత్వాలు జాతీయౌన్నత్యమునకు తోడ్పడజాలవు. హక్కులను, అవకాశములను పురుషులతోబాటు స్త్రీలు సమానంగా అనుభవించకలగాలియనేది అన్నివిధాల సమర్థనీయము. అయితే హక్కులు, అవకాశములు సమానస్థాయిలో ననుభవించనున్నప్పుడు బాధ్యతలను సయితం సమానంగా స్వీకరించగలగాలి. స్త్రీలు హక్కులను, అవకాశాలను సమానస్థాయిలో కోరుతూ బాధ్యతలను విస్మరించినచో క్షేమకరమనిపించుకోదు. స్త్రీల మనోధైర్యం, శీలసంపద, చిత్తశుద్ధి పురుషుని దైనందిన జీవితంలో మార్గదర్శకముగాను, ఆదర్శనీయంగా నుండగలవు; పురుషుల నుత్సాహపరచి కార్యోన్ముఖులను చేయును. స్త్రీ పురుషులిద్దరు

(473 వ-పేజి చూడుడు)

# త్రాగుబోతు


జర్మను మూలం :
హాన్స్ ఫల్లాడా

ఆంధ్రానుసరణ :
డాక్టరు వి. ఎన్. శర్మ




ఇంతవరకు సాగినకథ

[క్రిందటి నెల "గృహలక్ష్మి" సంచికలో జర్మను సాహిత్యరంగంలో తలమానికమని పేరుగాంచిన ఫల్లాడా కథా శిల్పాన్ని పాఠకులకు పరిచయం చేయటానికి ప్రయత్నించాను. ఈ కథలో ముఖ్యపాత్రలు ఎర్విన్, ఆయన భార్య మాగ్దా. మంచిరోజుల్లో భార్యా భర్తలు చేదోడు వాదోడుగా నుండిపోతూ ఒక వ్యాపార సంస్థను స్థాపించారు. వారిద్దరి కృషి మూలంగా వాళ్ల సంస్థ దేశంలో మంచిపలుకుబడి సంపాదించుకున్నది. అంచేత వాళ్ల ఆర్థిక పరిస్థితులు వున్నతదశకువచ్చాయి. అలాటి దశలో వాళ్లమధ్య ముసలం పుట్టింది. తమాషాకోసం పానీయాలని రుచిచూడటానికి మొదలెట్టిన భర్త, ఎర్విన్ త్రాగుబోతు అయ్యాడు కొద్ది కాలంలోనే. దాంతో వాళ్ల వ్యాపారసంస్థ పని తారుమారై పోయింది. ఒక రోజున దీన్నంతా భార్య మాగ్దా తెలుసుకున్నది. భర్తను నిలువబెట్టి అడిగింది. కాని అతను, తన అయోమయావస్థలో తగిన సంజాయిషీ నిస్తేగా! అంచేత ఇటుగాని, అటుగాని తేల్చేసుకోవాలని పట్టుపట్టింది. దాంతో భార్యను ధిక్కరిస్తూ ఆఫీసునుంచి భర్త బయిటికి వచ్చేస్తాడు. ఇక చదవండి]

## I

మా ఆఫీసును అలా చిందరవందర చేసేసి బయటికి వచ్చానంటే ఇకముందు అటుకేసి వెళ్ళకూడదని నిశ్చయించుకున్నానని చెప్పటం అనవసరం. అగ్నిపర్వతం ఇంతవరకూ లోపలనే రగిలిపోతూ వుండేది. ఇప్పుడో! నా భార్య మాగ్దా ఇందులో కలుగజేసుకోటంతో, అమాంతంగా పైకి పెగిలి వచ్చేసింది. ఇక ఇలాటిదాన్ని ఆపటానికి ఎవళ్ల తరమవుతుంది? ఈ వ్యాపారం నా ఇప్పటి మనోతత్వానికి సుతరాం సరిపడిందికాదు. ఆ రహస్యం మాగ్దాకి తెలియనీయకుండా ఇంతవరకు కప్పివుంచాను. మంటలు ఇప్పుడు ఇలా భగభగ మండిపోతూవుంటే మాగ్దా ఇక ఎలా వుదాసీనంగా వుంటుంది. ఇటో అటో తేల్చేకోవాలని పట్టుపట్టింది. ఇటు మా ఖాతాదారుల ముందు, అటు మా పనివాళ్లముందు నన్ను బడుద్ధాయ క్రింద కట్టేసి అవమానం చేసింది....

ఆఫీసును వదిలిపెట్టి వచ్చాను. మాగ్దా నామీద అలా యుద్ధాన్ని ప్రకటించాక, ఇక మా యింటికేసి ఎలా వెళ్ళగలుగుతాను? అలా భీష్మించుకోటం బాగానే వుందికాని ఇప్పుడు ఎటుకేసి వెళ్ళటం?... ఇది గడ్డు సమస్య. మంటలు ఇలా భగభగ మండిపోతూవున్న సమయంలో దీనిని ప్రశాంతంగా తేల్చుకోటం సులభమైన పని కాదుగా...

ఈ వూరికి ప్రస్తుతం ఒక నమస్కారం పెట్టేసి ఆ అడవి మధ్యలో నాకు బాగా నచ్చిన కుగ్రామం కేసి చప్పున వెళ్ళిపోవటం అన్నివిధాలా మంచిదనుకున్నాను. అక్కడి హోటలు నాకు బాగా నచ్చింది.

అక్కడివాళ్లు ఆ రోజుల్లో నన్నెంతో నిర్లక్ష్యంగా చూడటానికి ప్రారంభించినా!...

ఆ చోటు ఇక్కడ వుంటేగా! ఎంతో దూరం నడవాలి. కొంతదూరం దోవ బాగానే వుంటుంది. మరి కొంతదూరం ఎత్తుపల్లాల నెన్నిటినో దాటాలి. అదంతా అడవి ప్రదేశం అన్నమాటేగాని, సస్యశ్యామలమైన పొలాలు, తోటలు ఎన్నో చూడవచ్చు. వాటిని చూస్తూ నడుస్తూ వుంటూంటే ఇప్పటి విషాద సంఘటనే పూర్తిగా మరచిపోవచ్చు. భవిష్యత్తును నెమరువేసుకోటానికి మంచి అవకాశం దొరుకుతుంది. ఇలాటి ఆలోచన బుర్రలో తట్టాక ఇక ఈ వూళ్లో ఒక్క క్షణమైనా వుంటానా?...

తప్పంతా నాదే. కాని త్రాగుబోతని అలా అందరి ముందు మాగ్దా అనటం మాత్రం తల తీసివేసినట్లయిపోయింది. దాంతో వూరక వుండిపోయిందా? త్రాగుబోతులు నీతినియమాలనే పూర్తిగా మరచిపోతారట! నా భార్య నన్నిలా అనటమా? తను ఏం చేయబోతుందో స్పష్టంగా చెప్పివేసింది. అంటే ఈ కారణంమూలాన మా పెళ్లినే రద్దు చేయించటానికి కేసు పెడుతుందట. అదంతా చకచక జరిగిపోతుందని మాగ్దా అనుకుంటున్నది. అలా జరిగిపోవటం అంత సులభసాధ్యమా మరి?...

త్రాగుబోతునైనందుమూలాన మాగ్దాతో సంసారయాత్రని జరుపుకోటానికి నాకేమాత్రం అర్హత, హక్కు లేదని డాక్టరు సర్టిఫికేటు ఇయ్యాలి. అలాటి సర్టిఫికేటు సంపాదించటం సులభమనుకుంటున్నది మాగ్దా. మా ఇంటి డాక్టర్ మాన్స్ ఫీల్డ్ వుండనే వున్నాడు. మా కొత్త ఇంట్లో ప్రవేశించిన తర్వాత మాగ్దాకి జబ్బుచేసింది. ఆ సమయాన ఆ డాక్టర్ని పిలిపించాను. ఆయన ఎంతో శ్రద్ధతో వైద్యం చేశాడు. అప్పటినుంచి ఆయనంటే మాగ్దాకి ఎంతో ఇష్టం. అప్పటినుంచి ఆయన సలహా తీసుకోంది ఏ పని చేసేదికాదు...ఇప్పుడు ఈ భార్యామణిగారు చేయబోయేది తిన్నగా ఆ డాక్టర్ మాన్స్ ఫీల్డ్ గారి దగ్గరికి వెళ్ళటం, అవాకులు, చెవాకులు ఎన్నెన్నో నామీద చెప్పివేస్తూ సర్టిఫికేటు సంపాదించుకోటానికి అవసరమైన తతంగాన్ని చర్చించటం. ...సర్టిఫికేటు ఇయ్యటానికి ముందు నన్ను పరీక్షించాలిగా! ఆయన సర్టిఫికేటుతో ఈ కథా కమామీషూ ముగుస్తుందా? రూల్సు వున్నాయి. బోలెడు లొసుగులు వున్నాయి. వాటి ప్రకారం ఆసుపత్రిలో పెద్ద డాక్టరు పరీక్షచెయ్యాలి. దానికోసం కొంత కాలం అక్కడే వుండిపోవటం అవసరం....తరువాతే కోర్టులో విచారణ, తీర్పు. కోర్టుతీర్పు అందాకనే మా కంపెనీమీద అధికారాన్ని చెలాయించటానికీ, మా ఆస్తిపాస్తులని తన ఇష్టం ప్రకారం వుపయోగించుకోటానికీ మాగ్దాకి స్వాతంత్ర్యం వుంటుంది....ఈ తతంగమంతా తారుమారు చేయటానికి నాకు తెలివితేటలు లేవని భ్రమపడుతూ వుంది ఈ భార్యామణిగారు! రెండు మూడు రోజులు ఈ పానీయాలనే ముట్టుకోకుండా వుండిపోయినా ఆ డాక్టర్ మహాశయుడు ఎలా సర్టిఫికేటు ఇస్తాడో చూద్దాంగా! పెద్ద డాక్టర్ తన కెందుకు వచ్చింది ఈ బాదరబందీ అని వూరకుండిపోతాడు...అంతదూరం పోనియ్యటమెందుకు? మా డాక్టర్ కే కనబడకుండా కొన్నాళ్లు అజ్ఞాతవాసంలో వుండిపోయినా ఆయనే విసికి వేసారి ఇందులో కలుగజేసుకోకుండానే వుండిపోతాడు. దాంతో మాగ్దాకి తగినశాస్తి అయిపోతుంది...

మక్కి ఇలా ఎదురు తిరిగిపోతే మాగ్దా ఇక ఏం చేయగలుగుతుందో చూద్దాంగా!...పెళ్లికాకముందు ఇద్దరమూ సామాన్య సంసారంలోంచి వచ్చాం. మా అదృష్టం పండటం పెళ్లి అయ్యాకనే. ప్రారంభంలో మేము పెట్టిన కంపెనీ ఎంతో చిన్నది. మూలధనం అంత చెప్పుకోతగ్గది కాదుకూడా! మేమే యజమానులం. గుమాస్తాలం. నౌకర్లం కూడా! అయిదేళ్లలో కంపెనీ పేరు ఈ వూళ్లోనే కాకుండా, దేశమంతటా ప్రాకిపోయింది. బ్రాంచీలను స్థాపించాము, మా ఖాతాదారులు కోరిన సామాన్లను ఎప్పటికప్పుడే సప్లయి చేయటానికి కావలసిన శక్తి సంపదలను సంపాదించుకున్నాము. వచ్చిన లాభంలో కాస్తో, కూస్తో సంసారాన్ని నడుపుకోటానికి వుపయోగించుకుంటూ వున్నా, మా వ్యాపారాన్ని మరి యెక్కువగా వృద్ధిచేసుకోటానికే వినియోగిస్తూ వుండేవాళ్లం. బ్యాంకులో స్వంతాన సొమ్ము వుంది. స్వంత ఇల్లు వుంది....మాగ్దా పట్టుపట్టి ఈ విడాకుల కేసులో గెలిచినా మా ఆస్తిలో సగం మాత్రమే తీసుకోగలుగుతుంది. ఆవిడ సొమ్ము ఎక్కువ భాగం ఖర్చుపెట్టింది ఇంటికోసం. అంచేత న్యాయరీత్యా ఇల్లు ఆవిడ భాగానికే రావచ్చు....వున్నదాంతో తృప్తిపడక ఇంకా పిచ్చిపట్టు పట్టిందా...అంటే నా భవిష్యత్తునే సున్నపాలు చేయటానికి నిశ్చయించుకుందా?...అలా చేయాలన్న ఎంతో నాటకం ఆడాలిగా

లని వస్తుంది. ఉన్మాదుడని డాక్టర్లు సర్టిఫికెట్లు ఇయ్యాలి. కోర్టులో రుజువు చేయటానికి ఎంతో కథని నడపాలని వస్తుంది....

ఆఫీసులో నా శివాలూ, చిందులూ కళ్లార చూశాక, మాద్గా అంతదూరం పోకుండా పూరక వుంటుందా? అన్ని అవాంతరాలకు సిద్ధంగానే వుండాలి. వాటిని ఎదుర్కొనటానికి అవలంబించాలసిన పద్ధతులని ఇప్పటినుంచే ఆలోచిస్తూ వుండటం ముఖ్యం. అవసరం....

ఎంతదూరం నడిచినా చేరుకోవాలసిన చోటు అంత సులభంగా కనబడితేగా! ప్రారంభంలో ఇలా నడవటం అంత కష్టమైన పనిగా కనిపించింది కాదు. కాని కొంతసేపయ్యాక అలసిపోయాను. దాంతో పిచ్చిపిచ్చి ఆలోచనలు! ముచ్చెమటలు పోశాయి. ఇక కాళ్లు కదలిన పాపాన పోతేనా! దాహం. ఆకలి.... దాహం తీర్చుకోటానికి జేబులో దాచి వుంచుకున్న సీసాని తీసి రెండు మూడు గుటకలతో పూర్తిచేశాను. అలా తాగినా దప్పి తీరితేనా! ఇక ఆకలి సంగతి చెప్పాలా?...

అప్పటికే మిట్టమధ్యాహ్నమైంది. పొలాల్లో, తోటల్లో పనిపాటలని కట్టేసి గ్రామస్థులు భోజనాలకి వెడుతూవున్నారు. వాళ్లల్లో కొంతమంది నాకేసి చూస్తూ మందహాసంచేస్తూ ముందుకి గబగబ నడుస్తూ వున్నారు. మరికొందరు వెలంవెర్రిగా నాకేసి చూస్తూ వెడుతున్నారు. ఇంకా కొంతమంది విస్తుపోతూ చూడసాగారు. అలా వాళ్లు నాకేసి చూడటంలో కారణం వుంది. ఇవ్వాళ సెలవురోజు కాదే! పట్నవాసం మనిషి ఏంపుట్టి మునిగిందని ఇలా అలసిసొలసి ఇంత మిట్టమధ్యాహ్నకాలంలో ఈ గ్రామ పరిసరాల్లో నడుస్తూ వుండటం? దాంతో నా ఆకారం! సిరా ముద్రలతో నిండిపోయిన నా దుస్తులు!...

ఇలాటి పరిస్థితుల్లో ఈ ఆకారంతో ఇప్పుడే వూళ్ళోకి చేరుకోటం మంచిది కాదనుకున్నాను. ఎవళ్లకీ కనబడకుండా ఏ పొదలోనైనా, లేకపోతే ఏ చెట్టు నీడలోనైనా కొంచెంసేపు విశ్రాంతి తీసుకొని జనం వాళ్లవాళ్ల భోజనాలు ముగించుకుని తిరిగి పనిపాటల్లోకి వెళ్ళిపోయాక హోటలుకేసి నడవటం వుత్తమోత్తమని బుర్రలో తట్టింది....

నా ఖర్మం. విపరీతమైన దాహం! బుద్ధిలో ఏమీ లేదు. మరో బుద్ధి కావాలంటే వూళ్ళోకి నడవాలి. అంచేత ఆ ఆశని కొంతకాలం మరచిపోవటం మంచిదని అనుకున్నాను. ప్రశాంతంగా పడుకోటానికి మంచితావు కనబడింది. చుట్టుప్రక్కలనున్న గడ్డి గట్రాని సేకరించి పడకగా అమర్చి అక్కడే పడుకున్నాను. నిద్రాదేవత చప్పున ఆవరించి ఈ లోకపు బెడదలని మరచిపోవడానికి కావలసిన వాతావరణాన్ని ప్రసాదించింది....

కళ్లు తెరచి చేతిగడియారంకేసి చూసేటప్పటికి ఎంత ఆశ్చర్యం వేసిందో ఇక చెప్పాలా? మిట్ట మధ్యాహ్నం పడుకున్నవాణ్ణి సాయంకాలం అయిదు గంటలవరకు చీకూచింతా లేకుండా నిద్రపోయానన్నమాట! సూర్యుడు ఇంకో గంటలో అస్తమించబోతున్నాడు. ఇక ఇలాటి పరిసరాలలో పడుకుని వుండటం ప్రమాదం....పడుకున్నవాణ్ణి అమాంతంగా లేవబోయాను. దేహం నా స్వాధీనంలో వుంటేగా లేచి కూచుండటానికి. ఒళ్లు కంపించిపోతూవుంది. కాళ్లూ చేతులూ కదలటంలేదు. ఏమైనా పుచ్చుకుంటేనేగాని ఈ బండి కదలటం బ్రహ్మాండం. అది దొరకటమో?...

ఎలాగైతేనేం సూర్యాస్తమయం లోపునే ఈ దేహాన్ని హోటలు పరిసరాలకి చేర్చగలిగాను. అక్కడ నా యీ అసహాయతని చూపానా ఇంకేం వుంది?...

రాత్రి భోజనాలకి లోపల పెద్ద హాల్లో బల్లలమీద పాత్ర సామానంతా అమర్చబడి వుంది. అతిథులు రావటానికి ఇంకా వ్యవధి వుంది. అంచేతనే గాబోలు హోటలు యజమానురాలు విశ్రాంతి తీసుకోటానికి తన గదిలోకి వెళ్ళిపోయింది. ఎక్కడలేని పిచ్చి శక్తితో నేను లోపల అడుగుబెట్టే సమయంలో, హోటలు అమ్మాయి వుండేమోనని నలుప్రక్కల కలయచూశాను. ఆ పిల్లకూడా కనబడింది కాదు. ఇక ఏం గత్యంతరం తోచక దగ్గరలో నాకు కనబడ్డ బల్లముందర కుర్చీ మీద కూలబడ్డాను. "లోపల ఎవళ్లూ లేరా?" అని గొంతు చించుకుంటూ అరిచాను.

నా అలజడిని యజమానురాలు విన్నది. ఓరగా లోపల గది తలుపు తెరుచుకుంటూ బయటకి వచ్చి నేను అక్కడ కూచుని వుండటం చూసింది.

(సశేషం)

# మర్మగుహ

శ్రీ సి. సి. పున్నయ్య



(జూలై సంచిక తరువాయి)

——(౦)——

(పోలీసులు వస్తారు)

పోలీస్:-ఏమిటీ గుంపు అర్ధరాత్రప్పుడు !

(అక్కడున్న వాళ్లెవరూ ఏమీ మాట్లాడరు)

పోలీస్:-ఏం మాట్లాడరేమిటి ?

గుంపులోని ఒకడు:-వీడు దొంగండీ! బ్యాంకులో దోచుకపోతుంటే పట్టుబడ్డాడు.

పోలీస్:-నిజమేనా ? సంకెళ్లు తగిలించండి.

రాజ:-మీ దయ యిక్కడి జనం నన్ను దొంగ అని అంటుంటే నేనేం చెప్పేది యిక !

పోలీస్:-అయితే పద స్టేషనుకు.

(రాజయ్య చేతులకు బేడీలు తగిలించి పోలీస్ స్టేషనుకు తీసికొని వెళ్లారు. గుమికూడిన జనం వివిధ మనస్తత్వాలతో తమ యిండ్లముఖం పట్టారు.)

♦ ♦ ♦

(వకీలుగారి యిల్లు. నాగమణి దొడ్డివాకిట్లో కూర్చొని ఆలోచిస్తూ యుంటుంది. వకీలు భార్య మహాలక్ష్మమ్మ యింట్లోనుండి అక్కడికి వస్తుంది.)

మహాలక్ష్మమ్మ:-మణీ! యీ వేళ ఏదో దిగులుగా నున్నట్లున్నావు !

నాగమణి:-ఏమీ లేదమ్మా !

మహా:-మీ నాయన వచ్చి చూచి చాల రోజులయిన దని కాబోలు! అందుకేనా ?

నాగ:-(కండ్లనిండా నీరు కమ్మినవి. తుడుచుకుంటూ) అదేం లేదమ్మా ?

మహా:-నాకు తెలుసులే అమ్మాయ్! నీకు దిగు లెందుకు చెప్పు! యీ యిల్లు మీదనే అనుకో - మంచిగుడ్డలు కట్టుకొని లక్షణంగాయుండు. నీ కేమైన లోటు జరిగితే చెప్పు! నీవేవిధంగా దిగులుపడుతూ యుండటం బాగలేదు.

నాగ:-నాకేం లోటులేదిక్కడ మీదయవల్ల.

(వకీలు రాఘవరావు యింట్లోకి ప్రవేశిస్తాడు.)

మహా:-చూడండీ! మణి వాళ్ళ నాన్న వచ్చి చూచి పోలేదని బెంగపెట్టుకున్నది.

రాఘ:-అది సహజం. నీకే యింకా మీ తల్లిదండ్రుల మీద, పుట్టింటిమీద వ్యామోహముంటే పసిది - మణికి ఆపాటివుండదా! ఏదో పాపం! తీరిక లేక వచ్చియుండడు, వస్తాడులే - యిదిగో చూడు మణీ! యీ పండు తీసుకొనివెళ్ళి తిను. (మణి పండు నందుకొని లోపలికి వెళ్ళిపోతుంది. వకీలు భార్య పూలు కట్టుకుంటూ కూర్చుంటుంది. రాఘవరావు సోఫాలో కూర్చొని కోర్టు విశేషాలు చెప్పనారంభించాడు.)

రాఘ:-ఈరోజున కోర్టు విచారణలో భార్య నగలను భర్త దొంగిలించాడని నేరం.

మహా:-వింతగా నున్నదే !

రాఘ:-అందులోనే యున్నది సూక్ష్మం. నీవు చెప్పు చూద్దాం !

నాగ:-(తలుపు ప్రక్కగా నిలబడి యుండి ఆ మాటలు విని మహాలక్ష్మమ్మ ప్రక్కకు వచ్చి నిలబడి) దొంగలుపడి భార్యాభర్తలు నిద్రపోతుండగా నగలను దోచుకపోయి యుంటారు. దొంగ ఎవరా అని కనిపెట్టలేక భార్య, భర్తే తన నగలను దొంగిలించియుంటాడనే నిర్ణయానికి వచ్చి యుండాలి. బహుశా ఆమె భర్త గుఱ్ఱపు పందాలకు పోవడం, చీట్లపేక, జూదం ఆడడం అలవాటుండటంవలన ఆమె నిర్ణయం బలపడి యుంటుంది.

రాఘ:-నిజమే మణీ! అతడు నిరపరాధి. తర్వాత దొంగ పట్టుపడ్డాడు.

నాగ:-అబ్బ! ఎంత మంచివార్త! నిజానికి ఏనాడూ చలనముండదు.

రాఘు:_మహాలక్ష్మీ! నాగమణి చాల తెలివిగలది సుమా! దేవుడు చిన్నచూపు చూచాడు కాని లేకపోతే యీమె ఏ సంపన్నుల యింట్లోనో పుట్టి పెరుగుతుండవలసినది.

మహా:_బాగా చెప్పారు - అమ్మాయ్ మణీ! విస్తళ్లు వేసి మంచినీళ్లు పెట్టమ్మా! భోజనాల వేళయింది
(అందరూ భోజనానికి లేచిపోవుదురు.)

♦ ♦ ♦

(పోలీస్ స్టేషన్‌లో ఇన్స్‌పెక్టరు దోషులను విచారిస్తూ వివరాలు సేకరిస్తుంటాడు. పోలీసులు నిలబడియుంటారు. ఎద్ల బండివాడు, రాజయ్య, సైకిలు దొంగిలించినవాడు, త్రాగుబోతులు యిలాంటివారనేకులు అక్కడే యుంటారు. ఒక కాన్స్‌టేబిల్ బండివాడిని చేయిపట్టుకొని యిన్స్‌పెక్టర్ ముందు నిలిపాడు.)

ఇన్స్‌పెక్టర్:-ఎవరితను?

కన్స్‌టేబిల్:-వీడు జనసమ్మర్థంగా నున్నచోట నడిరోడ్డుమీద బండి నిలిపాడండీ!

ఇన్స్:-ఏమయ్యా నిజమేనా?

బండివాడు:_లేదు బాబూ!

ఇన్స్:-ఎందుకయ్యా బండిని నడిరోడ్డుమీద నిలిపావు?

బం:-రోడ్డు కాదండీ _ సందులో _

ఇన్స్:-అయితే మాత్రం అక్కడెందుకు నిలిపావు? ప్రజల రాకపోకలకు ఆటంకమని తెలియదూ?

బం:-బస్తాలు ఎక్కించుకోడానికండీ!

ఇన్స్:-ఇకమీదట అలా ఎప్పుడు చేయబోకు!

బం:-చిత్తం బాబూ!

ఇన్స్:-సరే వెళ్ళిపో -

(బండివాడు పోవును)

ఇన్స్:-ఏమిటీ నేరాలు. బండి నిలిపాడని, నిద్రపోయాడనేనా మీరు కేసులు తెచ్చేది.

పో:-నెలాఖరు కదండీ! అందుకని బుక్ చేశాను.

ఇన్:_నీ బొందలాగుంది.
(మరొక పోలీసు రాజయ్యను ఇన్స్‌పెక్టరు ముందు నిలుపుతాడు.)

పో:_వీడు దొంగండీ - డబ్బుతోసహా పట్టుపడ్డాడు.

ఇన్స్:-ఆ! ఎక్కడ? _ యిదీ సరైన కేసు.

పో:-రాజ్యలక్ష్మి బ్యాంకిలోనండీ!

ఇన్స్:-సరైన చోటు. అక్కడే యిప్పుడు డబ్బు ఉన్నది. డబ్బు కలవాళ్ళంతా యీ రోజుల్లో భయపడి యిటువంటి అయోగ్యుల బారినుండి తప్పించుకోడానికని బ్యాంకుల్లో జాగ్రత్తపరచుకుంటున్నారు.

1 పోలీసు:-చిత్తం సార్!

ఇన్స్:-కేసు బుక్ చేశావా?

1 పో:-ఇంకా లేదండి _ ఇద్దరు సాక్షులున్నారు.

ఇన్స్:_ఏరీ వాళ్లు?

2 పో:_ఇదుగో (సాక్షులు రాఘవులు, కోటయ్య హాజరగుదురు).

ఇన్స్:-(ఆశ్చర్యంతో) రాఘవులూ! నీవుకూడా వచ్చావా! ఇదిగో యీ బల్లమీద కూర్చో.

రాఘు:_ఫరవా లేదులెండి!

ఇన్స్:-(కోటయ్య నుద్దేశించి) ఎక్కడ దొంగతనం జరిగింది?

కోట:-రాజ్యలక్ష్మి బ్యాంకిలో.

ఇన్స్:-నీ పేరు?

కోట:-కోటయ్య.

ఇన్స్:-(పోలీసుతో) చెప్పే వివరాలు వ్రాసికో.

పో:-అలాగే సార్!

ఇన్స్: అయితే కేసు విచారణ సందర్భమున కోర్టుకు రావాలి కోటయ్యా!

కోట:_తప్పకుండా వస్తాను.
(కోటయ్య పోలీసు రైటరు వెంట గదిలోకి వెళ్ళును.)

ఇన్స్:_రాఘవులూ! ఈ దొంగను నీకు తెలుసా?

రాఘు:-పొరబాటు సార్! వీడు అటువంటివాడు కాదండీ!

ఇన్స్:-భలే బాగుంది! మూటముల్లెతో సహా దొంగ పట్టుబడితే వీడు అటువంటివాడు కాదంటావేమిటి! మొత్తంమీద మహా పెద్దమనిషివి! _ ఇదిగో చూడూ! యిది పోలీస్ స్టేషన్ _ నాకు అడిగినదానికి సమాధానం కావాలి. వీడు బ్యాంకిలో దొంగిలించి పట్టుబడ్డది నిజమే కదా?

రాఘు:_దొంగిలించిన విషయం నాకు తెలియదు జనం గుమికూడియున్నారు. నేనూ విచారవ చే

కోని చూడడానికని గుంపులోకి వెళ్ళాను. పోలీసులు నన్ను వెంటబెట్టుకొని యిక్కడికి వచ్చారు. అంతే...

ఇన్స్:-ఎల్లుండి కేసు విచారణ. మరి నీవు సాక్ష్యం...

రాఘు:-జరిగింది, చూచింది వచ్చి చెప్తాను.

ఇన్స్:-మంచిది వెళ్ళు రాఘవులూ! (రాఘవులు వెళ్ళిపోగా రాజయ్య నుద్దేశించి) ఏమిటిరా! ఎన్ని రోజులనుండీ వృత్తి?

1 పో:-ఏమిటోయ్! అయ్యగారు అడిగిన ప్రశ్నకు జవాబుచెప్పక బొమ్మలాగ నిలబడతావేం!

రాజ:-చెప్పవలసిన దేమైనా యుంటేకదా నేను చెప్పటానికి!

1 పో:-అలా తా దారికి —

ఇన్స్:-ఏమిటీ! దొంగ రాస్కెల్ (లేచి రాజయ్య చెంపమీద ఫెళ్‌న కొడతాడు) ఈ బ్రతుకు కన్నా దున్నపోతులాగున్నావు కదా! చాకిరి చేసికొని బ్రతుకకూడదూ! — పోలీస్! వీడిని లాక్కెళ్ళి రిమాండులో నుంచండి.

(ఇద్దరు పోలీసులు రాజయ్యను లోపలికి పిలుచుకొని వెళతారు.)

◆ ◆ ◆

(కోర్టు హాలులో బెంచీలన్నీ భర్తీ అయినవి. అధికారులు, గుమాస్తాలు, న్యాయవాదులు వారివారి స్థానాలలో కూర్చొనియున్నారు. న్యాయమూర్తి రాగానే అందరూ లేచి నిలబడి ఆయన కూర్చొనగానే కూర్చుంటారు. బోనులో రాజయ్య హాజరుపెట్టబడుతాడు.)

ప్రభుత్వ న్యాయవాది:-(లేచి ప్రభువులకు యీ ముద్దాయిలు రాజ్యలక్ష్మి బ్యాంకిలో పదివేల రూపాయలపహరించి, డబ్బుతో కూడ పట్టుపడ్డాడని నివేదిస్తున్నాను.)

న్యాయమూర్తి:-సాక్షులు?

ప్ర న్యాయవాది:-ఉన్నారు—కోటయ్య, రాఘవులు.

బంట్రోతు:-కోటయ్యా! కోటయ్యా! కోటయ్యా! (కోటయ్య మరొక బోనులో రాజయ్య కెదురుగా నిలబడతాడు.)

గుమాస్తా:-నీవేనా కోటయ్య?

కోట:-అవునండీ!

ప్ర. న్యాయవాది:-(రాజయ్యను చూపిస్తూ) ఈయనను నీకు తెలుసునా?

కోట:-తెలుసు:-మూడు రోజులనాడు రాజ్యలక్ష్మి బ్యాంకిలో దొంగిలించి పట్టుపడ్డాడు.

ప్ర. న్యా:-పగటే కదూ!

కోట:-కాదు—రాత్రి 1 గంటప్పుడు.

న్యాయమూర్తి:-నీవు దొంగిలించునప్పుడు చూశావా?

కోట:-లేదండీ! పట్టుపడ్డప్పుడు చూచాను.

న్యా:-ఇక నీవు వెళ్ళవచ్చు. రెండవ సాక్షిని పిలిపించండి.

(రెండవ సాక్షి రాఘవులు హాజరు కాలేదు.)

పో. ఇన్స్పెక్టర్:-ఈరోజున యిబ్బందివలన రాఘవులు రాలేదు. ముద్దాయిని పట్టుకున్న పోలీస్‌ను ప్రభువులు విచారించవచ్చును.

న్యాయమూర్తి:-రప్పించండి.

(పోలీస్ వచ్చి నిలబడి సెల్యూట్ చేస్తాడు)

ప్ర. న్యాయవాది:-నీవేకదా యీ దొంగను పట్టుకుంది?

పో:-అవును సార్!

ప్ర. న్యా:-అతనిని నీవెందుకు పట్టుకోవాల్సి వచ్చింది? నీవు పట్టుకున్నప్పు డతని చేతుల్లో ఏమియున్నది?

పో:-దొంగయని పట్టుకున్నాను. చేతుల్లో డబ్బు సంచులుండినవి.

న్యాయమూర్తి:-డబ్బున్నదని నీవెలా యూహించావు?

పో:-ఇదిగో సార్! నోట్లకట్టలు (కోర్టువారి కందించును).

న్యా:-నీవితను దొంగిలిస్తున్నప్పుడు పట్టుకున్నానని కదూ యంటున్నావు!

పో:-ప్రజలు గుమికూడి యున్నారు. నేను అక్కడికి వెళ్ళేసరికి అక్కడివారంతా యితనిని దొంగ! దొంగ యంటూ డబ్బు సంచులను, అతనిని నాకొప్పజెప్పారు.

న్యా:-అయితే యితను దొంగిలించినట్లు నీకు తెలియదన్నమాట.

పో:-తెలియదు.

న్యా:-అయితే దొంగతనం ఎక్కడ ఎప్పుడు జరిగితే యితడు పట్టుబడ్డాడంటావు?

(474వ - పేజీ చూడుడు)

# ఐతరేయోపనిషత్తు

## పూజ్యపాద స్వామీ చిన్మయానందులవారి వ్యాఖ్యానములు-

అనువాదము: Dr. W. రాధాకృష్ణయ్య

(గతసంచిక తరువాయి)



ఈ నాలుగు పేర్లు వినుటవలన శిష్యులకట్టి తృప్తియు కలుగలేదు. ఉదాహరణమునకు, నేను, నా మిత్రునితో కలసి పోవుచుండగా, నా మిత్రుడు తన సహపాఠకుని, అకస్మాత్తుగ చూచి, ఆనందపరవశుడాయెను. వారిరువురి సంతోష పునర్దర్శనమును నేను గమనించుచుంటిని. వారు విడిపోయి, నా మిత్రుడు నన్ను సమీపించగా, ఆ ప్రియస్నేహితు డెవరని ఆతురతతో ప్రశ్నించితిని. "అతడు శ్రీ చటర్జీ" యని నా మిత్రుడు తెలిపినచో, నాకట్టి సంతృప్తిగాని, సంతోషముగాని కలుగజాలదు. కనుక, అతడు బడియందు తన సహపాఠకుడనియు, వారిరువురు పసితనమున అతి సాహసకార్యములు చేసియుండిరనియు, అతనింటిలో కొంతకాలము తాను అతిథిగ నుండెననియు, ఆ వ్యక్తినిగూర్చి కొన్ని వివరములను నా మిత్రుడు నాకు తెలుపుట ఆవశ్యకముగనుండెను.

అటులనే; గురువు నాలుగు లోకములు సృష్టింపబడెను అని తెలిపెను. దానితో తృప్తిపడని శిష్యులకు వాటి పేర్లను తెలిపెను. పేర్లవలన శిష్యులకట్టి విశేషములు బోధపడలేదు. శిష్యులకు గల భ్రమ వారి నేత్రములందు వికసించుట తెలుసుకొని గురువు వివరించుచున్నాడు.

అమ్భస్ - అనగా, నక్షత్రమండలము (ఆకాశము) నకు పైనయుండు ఈతర్ (Ether) అనబడు అంతరిక్షము. మరీచి యనగా కిరణములు. అదియే ఆకాశమనబడు వాయుమండలము (Atmosphere). సూర్యకిరణములు ఆకాశమండలము ద్వారా, విషయములపై బడునపుడు విషయములు ప్రకాశించును. అనగా సూర్యరశ్మి, కిటికీ ద్వారా యింటిలోనికి ప్రవేశించగా, అది నేలపై బడుచున్నది. ఆ నేల ప్రకాశించుచున్నది. ఒక మురికి పేలికను కిటికీవద్ద విదిలించినచో, దుమ్ము రేగి, సూర్యకిరణములచే ప్రకాశించును. అపుడు కిటికీద్వారా ఇంటిలోనికి, కిరణములు కోణముగ వాలియుండుట కనబడును. సూర్యకిరణములు ప్రతి అణువుపై బడుటచే, కిరణములెల్ల, స్పష్టముగ కనబడును. అట్టి దుమ్మువంటి అణువులతో సదా నిండియుండు భూమికి చుట్టు వ్యాపించియుండు వాయుమండలమును, మరీచి యని తెలుపబడుచున్నది. అనగా ప్రకాశమండలము.

మూడవది - మరం - అను లోకము. మర అనగ, మరణము. ఈ భూలోకమున, పరిమిత, పరివర్తనము అను రెండు గుణములు అన్యోన్యముగ, మృత్యుదేవతకు సేవ జేయుచున్నవి. కనుక, మనము నివసించు భూమికి మరలోకము, మర్త్యలోకము అని పేరు కలిగెను. ఈ భూతలమునకు క్రిందిభాగము, ధాతుమయమగు నీటిమట్టమును ఆపః అనబడును.

♦ . ♦ ♦

ఈ నాలుగు లోకములు, ఒక్కొక్క విధమగు వాసనల ననుభవించుటకు ఆవరణములుగ నున్నవి. ఇవన్నియు కలసి, సమష్టి సర్వవాసనల వ్యయమునకు, అనుభవములకు అవకాశమిచ్చుచున్నవి.

లోకమనగా, ప్రపంచమని భ్రమించుచున్నాము. అనుభవ ఆవరణమని నిజమైన భావము. ఈ లోకములను మూడంతస్థుల మేడకు పోల్చవచ్చును. ప్రతి అంతస్థున ప్రత్యేక కాపురము లున్నారు. వారివారి ప్రత్యేక సంసారముల ననుభవించుకొనుచున్నారు. నేలమట్టమున పైవారి సామగ్రి దాచుకొను నవకాశము కూడ యున్నది.

శ్రు॥ స ఈక్ష తేమే ను లోకా లోక
పాలాన్ను సృజా ఇతి.

[ఇవిగో లోకములు. వీటి రక్షకులను నేను సృష్టించెదనుగాక, అని అతడు తలచెను.]

మన కోరికల కనుగుణముగ, మన లోకములను మనము సృష్టించుకొనుచున్నాము. వాటికి మన సంకల్పబలమున తోడుపరుచుచున్నాము. అందువలన ఆ క్షేత్రములు వ్యవహార యోగ్యమగుచున్నవి. న్యాయవాదిగాని, వైద్యుడుగాని, తమ లోకములను నిర్ణ

యించిన వెనుక తన శక్తిని వాటికి జతపరచి, వారి కోరికలకు చైతన్యము కలిగించినయెడల, అవి వారి అనుభవములకు యోగ్యమగుచున్నవి. లేనియెడల వారి కోరికలు అనుభవింపబడవు. మనకు ఒక కోరిక కలిగెను. కోరిక రీతి ఆలోచనలుకూడ జతపడినచో, అనుభవములు కలుగగలవు. ఒక కోరికకు ఆలోచనలు చేరవలెను. శ్రద్ధ కలుగవలెను. పరిశ్రమ చేయవలెను. నియమించవలెను. ఫలమున కెదురు చూడవలెను. ఇవన్నియు మన శక్తిప్రయోగమువలన చేకూరును. అందువలన, వాసనలనబడు కోరికల రీతి ఆలోచనలు కలిగి, జీవితము ఏర్పడుచున్నది. దీనినే "లోకరక్షకులను మనము సృష్టించుచున్నాము" అను వాక్యము యొక్క భావము. మన వ్యక్తిగత జీవితమునకు ప్రతి దినము, మన ప్రపంచములను మనము సృష్టించుకొనుచున్నాము. అదియే సమష్టియందు ప్రపంచ సృష్టియని ఉపనిషద్మంత్రము వర్ణించుచున్నది.

పరబ్రహ్మము సమష్టి వాసనచే నిబద్ధుడగుచున్నాడు. అతడు నాలుగు లోకములను ఏర్పరచెను. అట్టి ఆలోచనలకు పరమాత్మ తన సంకల్పశక్తిని జతపరచెను. ఈ రీతి లోకరక్షకుల నతడు సృష్టించెను.

శ్రు॥ సోఽద్భ్య ఏవ పురుషం సముద్ధృ
త్యామూర్ఛయత్॥ (3)

[పిమ్మట అతడు జలములనుండి పురుషుని (రూపమును) వెలికిదీసెను.]

లోకముల సృష్టించిన వెనుక, వాటికి తన సంకల్పశక్తియొక్క బలమును (రక్షకులను) జతపరచెను. ఒక్కొక్క వాసన తన క్షేత్రమున పూర్ణానుభవము పొందుటకు ఒక ఉపకరణమును సృష్టించెను. "అతడు జలములనుండి ఒక రూపమును సృష్టించెను." ఒక చిత్రకారునికి రూపసౌందర్యముల భావములు తెలియును. ఆ భావములు ప్రకటించగల రూపములు, వర్ణములు, సమవిభక్తములు, వాటి స్థానములు అన్నియు తెలియును. తెరగుడ్డ, వర్ణములు, బ్రష్షు మొదలగు పరికరములు దగ్గరయున్నవి. అయినను, సంస్కారముపొంది, నెమ్మదిగ చిత్రించగల చేతులు, వేళ్లు లేకున్నచో, అతని హృదయమునగల భావములు తెరగుడ్డపై చిత్రరూపమున కనబడజాలదు. వాసనాక్షయము కలుగుటకు లోకములు సృష్టింపబడెను. మరి, అనుభవించగల దేహస్వరూపమొకటి అవసరమాయెను. అట్టి దేహస్వరూపమును పరమాత్మ సృష్టించెను.

జలమునుండి ఒక పురుషుని రూపమును పరబ్రహ్మము వెలికితీసెను. అనుటలోనే, ఆతురతతో, పాఠకుడు తన అజ్ఞానదోషమువలన, ఇవి ఋషుల తెలివిహీనతను తెలుపుచున్నవని దూషించగలడు. కాని, కొంత జాగ్రతతో విచారించినయెడల, గురువాక్యము లత్యంత శాస్త్రయుక్తములని తోచగలవు. నేటికాలమున (Dehydration) అను ఆహారపదార్థములనుండి జలాంశ బిందువులను తొలగింపగల విధానములను వినుచున్నాము. ఒక జీవజంతువునందలి జలాంశమును తొలగించినచో, దానియొక్క వ్యక్తిగత నామరూపములు కోలుపోవుచున్నవి. అది భస్మరాశి యగుచున్నది. ఒక శవమును ఎలక్ట్రిక్కు కాష్టమున అగ్నిసంస్కారముచేసిన వెనుక, పిడికెడు భస్మము మాత్రము మిగులును. అందువలన ఆ శవమునందుండిన పరిమాణమంతయు జలరాశి తప్ప వేరు కాదు.

మరియు, రసాయనశాస్త్ర విధానమువలన, ఒక స్ఫటికమునగల జలాంశమును అగ్నిసంస్కారమువలన తొలగించినచో, అది రూపము చెడి, భస్మమగుచున్నదని తెలియుచున్నది. రూప పరిమాణములు నీటినుండి ఉత్పత్తి చేయబడెను. అనగా, పైన తెలిపిన శాస్త్రసమ్మతమునకు కవిత్వ సౌందర్యము చేర్చి ఋషి తెలుపుచున్నాడు.

ఇందు పురుషుడనగ, మీకు, నాకు, మానవులలో ప్రథముడగు ఆడం మహాశయునికి అన్వయించుటలేదు. స్థూల, దృశ్య ప్రపంచముగ వ్యక్తమగు విరాట్ స్వరూపునికి పురుషుడని పేరు. అనగా, బ్రహ్మాండమునకు కారణమగు మూలబీజాంకురము. బ్రహ్మాండమునగల రూపములు కావు. ఇప్పుడు, కేవల రూప ప్రశంస మాత్రము కలదు. అనగా, ఒక అండమున దాగియుండు కోడిపిల్లవంటి రూపము. ఒక బీజమునందణగియుండు వృక్షమువంటిది. గర్భమున పెరుగుచుండు పిండమువంటిది. దానికి రూపము కలదుకాని, ప్రత్యేక ఆకారములు సమకూడలేదు. బ్రహ్మాండమున సంభవించు వృద్ధిక్రమమంతయు, ప్రతి మానవుడు తన గర్భవాసమున యనుభవించుచున్నాడు. తండ్రి తన కోరికల కనుగుణమగు యొక క్షేత్రమును నిర్ణయించి, తన బీజమును ద్రవరూపమున ఆ గర్భమున యుంచును. గర్భమునందా బీజము పెరిగి, రూపములేని ఆకారము పొందును. పిమ్మట అవయవములు ప్రత్యేకముగ ఏర్పడును. అదియే క్రమముగ వృద్ధిపొంది

రూపలావణ్యములుకల పూర్ణమానవరూపమును పొందుచున్నది.

ఇందుగల సూక్ష్మభావములను ధ్యానించుకొలది, మాటల కతీతముగనుండు అంశములను కనుగొనగలము. ధ్యానశిఖరములనుండి అనేక నూతన దృశ్యములను చూడగలము. బ్రహ్మాండమంతయు మన పిండాండమున స్పష్టముగ కలుగుచున్నదని తలచుటే గాక, అనుభవించగలుగుచున్నాము.

ఈ బ్రహ్మాండమంతయు నా స్వరూపము. నా స్థూలరూపమే విరాట్టు. నా సూక్ష్మరూపము హిరణ్యగర్భుడు. నా కారణశరీరమే బ్రహ్మాండమున ఈశ్వరుడు. వీటినెల్ల నతిక్రమించియుండు నా జీవమే పరబ్రహ్మము. ఈ నామరూప ప్రపంచమునకంతయు అతడే ఆధారము. ఈ సృష్టికి పూర్వము, నేను, ఏకము, అద్వితీయముగ నాయందే రమించుచుందును. (I-వ మంత్రముయొక్క తాత్పర్యము — అన్వయము.)

శ్రు॥ తమభ్యతపత్తస్యాభితప్తస్య, ముఖం నిరభిద్యత, యథాణ్డం. ముఖాద్వాగ్వాచోఽగ్నిః॥

[ఆ పురుషాకారమును గూర్చి పరబ్రహ్మము చింతించుచుండగా, అది పగిలి, ఒక నోరువలె స్వరంగమేర్పడెను. ఆ నోటినుండి వాక్కు బయలుదేరెను. వాక్కునుండి అగ్ని కలిగెను.]

నీటినుండి వెలువడిన అండమునుగూర్చి, పక్షి గ్రుడ్లను పొదుగునట్లు, అతడు సమష్టి వాసనల కనుగుణముగ ఆలోచింపదొడగెను. పక్షి పొదుగుటవలన గ్రుడ్డు చీలును. అదేవిధముగ ఆ పిండాకారమునయొక చీలిక ఏర్పడెను. అది నోరువలె నుండెను. ఆ నోటినుండి వాక్కు, మాట్లాడగల శక్తి కలిగెను. అట్టి వాక్కునుండి అగ్ని — పంచ మహాభూతములలో నొకటి — ఉత్పత్తి పొందెను.

ఈ మానవశరీర మనబడు యంత్రనిర్మాణము, సక్రమముగ వ్యవహరించుటకు, జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు కలిగియున్నవి. ప్రతియొక్క ఇంద్రియమునకొక ప్రత్యేక వ్యవహారశక్తి యున్నది. ఈ శక్తులుపయోగపడుటకు వీటికి, అధిష్ఠాన దేవతలు కలవు. నవీన విద్యావంతుడీ మాటలకులికిపడ నవసరములేదు. ఇందలి కవిత్వమును, పద విభాగమును చేయుటవలన, ఋషి వాక్యములు, వస్తుశాస్త్రపట్టముల రీతి యున్నవనియు, శరీరశాస్త్రము ననుసరించుచున్నవనియు తెలియగలదు.

మాంసమయ ఇంద్రియములగు కండ్లు, చెవులు, నోరు మొదలగునవి సంస్కృతమున గోళము లనబడును. అనగా, జ్ఞానము కలిగించు కర్మకు ఉపయోగపడు కరణములు. ఈ కరణములను నియమించు జ్ఞానకేంద్రములు మెదడునందున్నవి. వాటిని ఇంద్రియము లనబడును. వీటియందు కలుగు జ్ఞానశక్తిని, దేవత యనబడును. అనగ, ఇంద్రియము వ్యవహరించగల యోగ్యతపొందుటయందు ముఖ్యాంశము దేవత యగును.

వాక్శక్తి వ్యవహరించగల గోళము నోరు. నోరు లేకపోయినచో వాక్కు వెలువడదు. నోటియందు వ్యవహరించు ఇంద్రియము వాక్కు. (వాగింద్రియము). వాగింద్రియము శక్తివంతమగుటకు (వ్యవహరించుటకు) అగ్ని దేవత అధిష్ఠించవలెను.

అగ్ని దేవత వాక్యములు పలుకుటకు అధిష్ఠాన దేవత యనుట, కడు సౌజన్యముగ నున్నది. కొన్ని మాటలు పలుకునపుడు మండిపడెనందుము. కొన్ని యుపన్యాసములు సభ్యులనేకాక, ఆ తరమువారిని కూడ కాల్చివేయుచున్నవి. కొన్ని భావములు "ఉడుకుడుకుగ నున్నవి" యందుము. కొన్ని వాదములు అత్యుష్ణముగ నున్నవందుము. వీటివలన, వాక్యములకు అగ్ని బలమొసగుచున్నదని తెలియవలెను.

ఉష్ణపదార్థములు భుజించుటవలన, వాక్శక్తి వృద్ధియగునని కొన్ని వ్యాఖ్యాతల అభిప్రాయము. ఆయుర్వేద శాస్త్రమున, (ఘృతము) నేయిని అధికముగ భుజించుటవలన, వాచాలుడగునని తెలుపబడియున్నది. నేడుకూడ సమాజమునందు, ఉపన్యాసములు విశేషముగ మాట్లాడు రాజకీయవేత్తలు, మతప్రచారకులు, తాము దైవమునకు ప్రీతిపాత్రులని తలచి, సంఘమున దొరకు నేయిని అధికభాగము వారి కడుపులందు చేర్చుకొనుచున్నారు. ఒక ఉపన్యాసకునకుగాని, ఒక గాయకునికిగాని గొంతు రాపు కలిగినచో, వేడి మిరప రసమును, కొంత నెయ్యివేసి త్రాగుట కిచ్చుచున్నారు.

(సశేషము)

# 'అర కప్పు'

శ్రీమతి గుజ్జం అరుంధతి



కాఫీ పానీయాలలో అత్యుత్కృష్టమైనది ఒకటని దానిని త్రాగే వాళ్ళందరికి తెలుసు. కాఫీ వంటిని, ఇంటిని గుల్లచేస్తుందని చెప్పే వాళ్ళేరోజుకు నాల్గుకప్పులు తక్కువ కాకుండ తాగుతారు. దానిలోవుండే మహాత్మ్యమో లేకపోతే అంటు జాడ్యమో ప్రతి వాడ వాడ అల్లుకొంది. దానిని యీ రోజు మాన్పించడం అంటే ఏ గవర్నమెంటు ఎన్ని పంచవర్ష ప్రణాళికలు పెట్టినా వీలు అయేటట్లు లేదు.

ఎవరైనా మా యింటికి వస్తే 'కాస్త కాఫీ పుచ్చుకొని వెళ్ళండి అనేది అల వాటై పోయింది. మొన్ననే మాయింటికి రంగనాయకుల పేటనుండి మా స్నేహితు రాలు ఒకమ్మాయి వచ్చింది. పాపం ఆ అమ్మాయికి 'కాఫీ' అలవాటు ఎక్కువట- దానిని తగ్గించలేక పోతున్నదట. ఎంత గానో నొచ్చుకుంది. ఎప్పుడో మధ్యా హ్నం వచ్చింది. కాఫీ వేళయింది. యీవిడ కాఫీ తాగందే వెళ్ళ లేదని కాఫీ తయారు చేసి ఒక కప్పు ఇచ్చాను.

'అబ్బే అంత అక్కరలేదండీ, అర, అరకప్పుచాలు 'అంది 'అదేమిటమ్మా కాఫీ ఒక కప్పుతాగక పోతే త్రాగినట్లే వుండదు. పరవాలేదులే కారదా త్రాగు' అన్నా.

'అత్తయ్యా! 'నీవు చెప్పినట్లు కప్పులు. కప్పులు, త్రాగుతూంటే నాగుండె మరీ బలహీనమయిపోతుంది' అన్నది.

'మరీ, అలా బాధపడేదానివి మానేయ్! అలవాటెందుకు చేసుకొన్నావు!' అని అడిగాను.

'ఏం చేయమంటావు అత్తయ్యా! త్రాగకపోతే, అసలు పని చేయలేను, అసలు నాబ్రైను వర్కు చేయదు' అంది.

ఆ పిల్ల అమాయకతకు నా కెంతో నవ్వొచ్చింది. బాధ పడుతుందని వూరు కొన్నాను.

పాశ్చాత్యులు యీ కాఫీనే ఇంకో రూపంలో పుచ్చుకొంటారు. దాన్ని 'Black Coffee' అంటారు. అంటే వట్టి 'డికాషన్' అన్నమాట. వాళ్ళు ఎప్పుడూ దీనిమీదనే ఆధారపడరు. ఇంకా అనేక 'Liquors' సేవిస్తారు. వాళ్ళు అలాంటివి ఎన్ని సేవించినా వంటికి ఎక్కువహాని చేయదు. దానికి ముఖ్యకారణమేమిటంటే వారు చలి దేశస్థులు.

మనది అసలే ఉష్ణదేశం. అందులోనూ నూటికి అరవైమంది ఎప్పుడూ అనా రోగ్యంగా వుండేవాళ్ళు. కాఫీలో 'కెఫిన్' అనే పదార్థముంటుంది. అది మనశరీ రంలో 'నర్వస్ సెంటర్'ను (Excite) చేస్తుంది అంటే నరాలను ఉద్రేక పరుస్తుం దన్నమాట. దానివల్ల గుండె త్వరితంగ కొట్టుకొంటుంది. ఇది బ్లడ్ ప్రషర్, గుండె బలహీనతకు దారితీయవచ్చు.

నేను డాక్టర్నుకాను. కాని ఇలాంటివి

వస్తాయని తెలిసిన తర్వాత నాకు తెలిసిన వారికి చెప్పేదాన్ని వాళ్లు నేనెంత మటుకు చెప్పినా చెవులురిక్కించి వినేవాళ్లు. తర్వాత అలవాటు మాత్రం తప్పేది కాదు.

ఈ మధ్యనే, పంచదార దొరకడం కష్టమైపోయింది. దానితో హోటళ్లు కూడ కాఫి ధర ఎక్కువ చేసినవి. ఇంట్లో ఎక్కడి పంచదార యీ కాఫీలకు చాలడంలేదు.

కాఫీ ఎక్కువ త్రాగేవాళ్లు 'అర' కాఫీలు త్రాగడం మొదలెట్టారు. (మా వారు ప్రత్యేక ఉదాహరణం లెండి)

నాకు కాఫీ అసలేగిట్టదు. పైత్యం చేస్తుంది. మా వారికి అది లేకుంటే నిద్ర పట్టదు. మాఇద్దరికి కాలం వెళ్లబుచ్చడానికి యీ కాఫీ సమస్యను, చర్చించుకొంటూంటాం. అంతేకాని నాకు అలవాటూ కాలేదు.

కనీసం, యీ కాఫీ అలవాటు ఆరోగ్యం కోసం కాకపోయినా, ఎకానమీ కోసం అన్నా 'అర' లోకి దిగడంమంచిది.

యీ 'అర' కాఫీ యుగంలో, అర కాఫీ జీవితం 'అర' ఆరోగ్యాన్ని భద్రపరుస్తుందని నానమ్మకం

# భక్తియోగ ప్రశ్నోత్తరి


మూలము :

"అవతార్"

శ్రీ శివానంద భగవాన్

శివానందనగరం

అనువాదము :

"శివానంద పాదసేవక్"

శ్రీ స్వామి శ్రీనివాసానంద సరస్వతి

శివానందనగరం


(జనవరి సంచిక తరువాయి)

**24. నిరాకారము సాకారమెట్లగును?**

జలము రెండు స్థితులలో నేవనగా నిరాకార (రూపరహిత)మగు ఆవిరి (steam) గను మంచు రూపములో సాకార (రూపసహిత)మగ నెటులుండగలదో నటులనే బ్రహ్మము నిరాకారము, సాకారము రెండును కూడనై యున్నాడు. నిరాకార బ్రహ్మము తన భక్తులయొక్క దైవిక (pious) ధ్యానమునకై కేవల నిమిత్తముగ రూపమును గొనును. సరిగ నెటుల వాయువు నిరాకారమై యుండి తుపాను (cyclone) గ సాకారమును గైకొనునో నటులనే నిరాకార బ్రహ్మ మాకారమును వహించును.

**25. భక్తియు, జ్ఞానమును అమ్లము (acid), క్షారము (alkali)ల వలె నసంబద్ధములా (incomfatibles)?**

కాదు. జ్ఞానము భక్తిని పెంపొందించును. భక్తి యొక్క ఫలమే జ్ఞానము. పరాభక్తియు, జ్ఞానమును నొకటియే. కేవలాద్వైత జ్ఞానియగు శ్రీ శంకరులు శ్రీహరి, హర, దేవీలయొక్క గొప్ప భక్తుడు. శ్రీరామకృష్ణపరమహంస కాళి నుపాసించి తన యద్వైత గురువగు స్వామి తోతాపురి గుండా జ్ఞానమును బడసెను. దక్షిణ హిందూదేశపు సుప్రసిద్ధ జ్ఞానియగు నప్పయ్య దీక్షితులు పరమశివప్రభుని తీవ్రమగు భక్తుడు.

**26. ఎవరు గ్రుడ్డి మనుజుడు?**

సమస్త రూపములలో దాగొనియుండు నొకే యొక యవినాశసారమగు (Imperishable Essence) "హరి"ని కనుగొనజాలని వాడే (మానవుడే) కాని తన భౌతిక మాంసచక్షువులతో చూడజాలని యొకడు గ్రుడ్డి మనుజుడు కాడు.

**27. ఎవరు మృత (చచ్చిన) మానవుడు?**

ఎవడైతే తన జీవితమును తినుట, త్రాగుట, నిద్రించుటలలో మాత్రమే గడపునో, ఎవడైతే మోక్షము నొందుటకై శ్రీహరి నారాధింప యత్నింపడో నట్టి యొకడు (మానవుడు) కాని యెవని ప్రాణములు వాని భౌతిక శరీరమునుండి వెడలినవో నట్టి యొకడు చచ్చిన మానవుడు కాడు.

**28. ఎవడు (చెప్పులు కుట్టు) మాదిగ (cobbler) వాడు?**

ఎవడు తన శరీరమును, దాని సంబంధములను గూర్చి మాటలాడునో, ఎవడాత్మ దృష్టినిగాక చర్మదృష్టిని గలిగియుండునో నట్టి యొకడు (మానవుడు) కాని చెప్పులను తయారొనర్చు నొకడు మాదిగవాడు కాడు.

**29. జపమన నేమి?**

జపము భగవంతునియొక్క నేదేని మంత్రపు టుచ్చారణయే.

**30. ఎన్ని రకములగు జపము గలదు?**

మూడు రకములు. వైఖరి (వాచిక), యుపాంశు (ఓష్ఠ్య పెదవులతో వినబడి వినబడనటుల పలుకునది), నింకను మానసికము (మనస్సులో నుచ్చరించునది).

**31. ప్రతి రకపు ఫలములేవి?**

వైఖరియొక్క వాటికంటెను ఉపాంశువుయొక్క ఫలములు వేయి రెట్లధికము. వైఖరియొక్క వాటికంటె మానసిక జపముయొక్క ఫలములు పదిలక్షల రెట్లధికము.

**32. జపము, ధ్యానముల మధ్య భేదమేమి?**

జపమేదేని మంత్రముయొక్క నుచ్చారణయే.

తన సహజలక్షణముల (attributes) తో కూడిన శ్రీహరి లేక శ్రీకృష్ణుని రూపముపై చింతనయే ధ్యానము.

**33. శ్రీహరియొక్క ధ్యానమొనర్చు టెటుల ?**

మానసికముగ నీ మనస్సు నా పరాత్పరుని పాద పద్మములవద్ద స్థిరపరుపుము. తదనంతరము మనస్సును వాని పట్టువస్త్రము (పీతాంబరము), శ్రీవత్సము, వాని హృదయముపై (నుండు) కౌస్తుభమణి, వాని భుజములపై నుండు దండ కడియములు (bracelets), చెవి ప్రోగులు (ear-rings), శిరస్సుపై కిరీటము, పిమ్మట చేతులలోని శంఖము, చక్రము, గద, పద్మములపై త్రిప్పి నటుపై తదుపరి వాని పాదములవద్దకు రమ్ము. పద్ధతిని తిరిగి, తిరిగి పునరావర్తన (repeat) మొనర్పుము.

**34. మనస్సు నెట ధారణ (ఏకాగ్రత) నొనర్చుట ?**

మీ యభిరుచి, మీ యభిలాషల బట్టి హృదయ పద్మము (అనాహత చక్రము) లేదా రెండు కనుబొమల మధ్యప్రదేశము (త్రికుటి)లో.

**35. భక్తియొక్క రెండు తరగతులెవ్వి ?**

అపరాభక్తి (అల్పతర భక్తి)యు, పరాభక్తి (ఉచ్చతరభక్తి)యును.

**36. అపరాభక్తి యన నేమి ?**

భక్తుడు తన యిష్టమూర్తి (విగ్రహము)ని గలిగి యుండును. ఆతడు ధార్మిక క్రియా (ritualistic) రాధనను, భగవదీయ కార్యముల (ceremonies) ను గలిగియుండును. ఆతడు విగ్రహములయొక్క పూజ నొనర్చును.

**37. పరాభక్తి యన నేమి ?**

ఈ రకపు భక్తుడు శ్రీహరిని సర్వత్రను సమస్త పదార్థములలోను గాంచును. తైలధార (నెడ తెగని) వలె వాని మనస్సు భగవంతునియొక్క పాదపద్మములవద్ద సదా లగ్నమైయుండును. ఆతడు సర్వాలింగన (all-embracing), సర్వ సంకలిత (all-inclusive) విశ్వప్రేమను గలిగి యుండును. ఆతడే జీవిపట్ల నత్యల్ప ద్వేషమును గలిగియుండడు. ఆతడు సమస్త ప్రపంచమును విశ్వబృందావనముగ చూచును.

**38. సకామ్యభక్తి యన నేమి ?**

భక్తుడు, ధనము, పుత్రుడు లేక నేదేని వ్యవహారము (undertaking) లో జయము నొందుటకు లేదా రోగమునుండి తన్ను తాను విముక్తుడగుటకు భగవాను నారాధించును.

**39. నిష్కామ్యభక్తి యన నేమి ?**

భక్తుడు ఫలాకాంక్ష (expectation of fruits) గలిగియుండడు. ఆతడు భగవానుని, భగవానుని మాత్రమే వాంఛించును. అది ప్రేమనిత్యర్థము ప్రేమ (Love for love's sake) యై యున్నది.

**40. వ్యభిచారిణీ భక్తి యన నేమి ?**

రెండు గంటలవరకు భగవానుని ప్రేమించుటయు, భార్య, పుత్రుడు, ఆస్తిని మిగిలిన కాలమున ప్రేమించుటయే.

**41. భక్తియొక్క నవ విధములేవి ?**

శ్రవణము భగవానుని లీలలు వినుట, కీర్తనము— ఆ పరాత్పరుని స్తవముల గానమొనర్చుట, స్మరణము — భగవానుని జ్ఞప్తియుంచుకొనుట, పాదసేవనము — భగవానుని పాదపద్మముల నారాధించుట (ప్రభావోటి దేశము, బీదజనుల యొక్క సేవ) అర్చనము—పుష్పముల సమర్పణ, వందనము — సాష్టాంగ ప్రణామములు, దాస్యము, సేవ, సఖ్యము — మిత్రత, ఆత్మని వేదనము — సంపూర్ణాత్మ సమర్పణ (శరణాగతి).

**42. స్నేహము, ప్రేమ, శ్రద్ధ, భక్తుల నడుమ తేడా యేమి ?**

చిన్నపిల్లలువంటి తక్కువగలవారి (inferiors) నెడ చూపబడు ప్రేమ స్నేహము, భార్య, స్నేహితులట్టి సమానుల మధ్య ననురాగమే ప్రేమ. తల్లిదండ్రులు, గురువులు నటువంటి మహాత్ములు నుండు తేజోవంతులవంటి పెద్దల (superiors) నెడ ప్రేమయే శ్రద్ధ. భగవంతుని నెడ ప్రేమయే భక్తి.

43. ఐదు విధములగు నుపాసన లేవి?
గణేశ, హరి, శివ, సూర్య, శక్తులయొక్క నుపాసన.

44. ఐదు విధములగు భావము లెవ్వి?
శాంతభావము (ప్రశమనత), దాస్యభావము - సేవకత్వము, సఖ్య భావము (మిత్రత్వము), వాత్సల్యభావము (మాతాపితృత్వము), నింకను మాధుర్యభావము (దాంపత్యత).

45. ఆరాధనయొక్క నైదు తరగతులేవి?
భూతములు (elementals) గతించిన జీవుల (departed spirits) యొక్క నారాధన, ఋషులు, దేవతలు, పితృలయొక్క ఆరాధన, నవతారములయొక్క ఆరాధన, సగుణ బ్రహ్మపుటారాధన, నిర్గుణ బ్రహ్మపుటారాధన.

46. చతుర్విధములగు ముక్తులేవి?
ఒక రాజ్యమందలి నివాసివలె భక్తుడు శ్రీ మహావిష్ణు వెందులో నివసించునో నా లోకములో నుండును. ఇది సాలోక్య ముక్తి. రాజుయొక్క పరిచారకుని (attendant) వలె భగవంతుని తోడు సన్నిహిత సాన్నిధ్యమున నాతడు నివసించును. ఇది సామీప్యముక్తి. రాజుయొక్క సోదరుని లేదా యువరాజువలె నాతడు భగవంతునియొక్క నదే సరిసమానమగు రూపమును బొందును. ఇది సారూప్యముక్తి. నీటిలో నుప్పు లేక పంచదార మాదిరిగ నాతడు భగవంతునితో నొకటగును. ఇది సాయుజ్య ముక్తి.

47. భక్తియొక్క నాలుగంతస్థులేవి?
మృదుమనోద్రేకము (tender emotion), తీవ్రానురాగము (warm affection), నుజ్జ్వలమగు ప్రేమ, తపన (దహించు), కాంక్షయును, శ్లాఘన, నాకర్షణ, నాసక్తి, యుత్కృష్ట ప్రేమయునని శాండిల్యుక వర్గీకరణము (classification) గలదు.

48. భగవదనుభూతి (సాక్షాత్కారము) నొందిన భక్తుడు పునర్జన్మ మొందునా? వాని వాసనలు సంపూర్తిగ తుడముట్టింప బడినవా? ఆతడు బాధ ననుభవించునా?
ఆతడు పునర్జన్మ మొందడు. సమస్తవాసన లిప్పుడు విధ్వంస మొనర్పబడినవి. ఆతడెవ్విధమగు బాధ ననుభవించడు. ఆతడు క్రమముక్తి (ఉత్తరోత్తర మోక్షము) నొందును. ఆతడు బ్రహ్మలోకము (గోలోకము లేక వైకుంఠము) నకు జనును. అనంతరమున నాతడు నిర్గుణ బ్రహ్మములో లీనమగును.

హరిః ఓమ్ తత్సత్!

("Bhakti Yoga Prasnottari" from BHAKTI & SANKIRTAN concluded).




కుటిలము గాదొ నా నడత క్రూరవిషంబులు గ్రక్కలేనొ నీ
కటువలె గాలిమేయుచు ననన్యఫలంబని దాస్యమూని చే
యుటకు సమర్థుఁడయ్యెదనొ యొప్పిలి వృద్ధిని నింటికంపినన్
భటునిగ శేషుఁగాఁదలఁచి పాలనసేయవె యంబుజోదరా!

కైరవ నీరజాప్తులిరుగన్నులు కాంత తటిల్లతాభ నీ
వారవికోటి తేజమునఁ బొంపిరివోయెద వందు రొడ్డితిం
బీరము సూపు పందెమిదె పేర్చితమంబగు నాదు నజ్ఞతన్
దూరముసేసి కైకొనుము దొడ్డయశంబది యంబుజోదరా!

కడఁగి సృజించి విశ్వములఁ గాచెడి భారముఁబూని పెంచి యుం
గడకు సమస్తలోకముల గ్రక్కస మ్రింగుట నీకు లీల మా
కడరది యొక్కటే మిగిలె నేటికిఁ జిక్కులఁ బెట్టెదయ్య! నేఁ
బడితి భవత్పదంబులనె బాములఁబాపవె యంబుజోదరా!

బరువయినట్లు నీళ్ళ నొక బండను మోపి యొకింత కాలమా
సురలకుఁ జెట్టుచేమలను జూపి గ్రహించితి పుజ్జ్వలాంగి శ్రీ
తరుణిని గౌస్తుభమ్ము గడుదండి తనమ్మునఁ బోడుసెట్టి దా
వఱడను లాభమొందకను వార్త నిజంబగు నంబుజోదరా!

ఏనొక క్రోతిఁ గట్టుకొని యీభవ సాగర మెట్లు దాటఁగా
నౌనని చింతఁజేసి మది నద్భుత సాహసవిక్రమంబునన్
వానర కోటి మేపి యొక వారిధిఁ గట్టిన ప్రోడవంచు నిన్
మానక గొల్తు నీదయిన మంత్రము చెప్పవె యంబుజోదరా!

భయపడ నీటి పామునకుఁ బత్తియునాకొక లెక్కయేమి? భ
క్తియనెడి త్రాడు రోసెడను దీవ్రముగా నది చేతఁ జిక్కెనా
పయిఁబడి యంటఁగట్టి తనివార భవద్గుణ రాశి దోఁతునా
పయి భవదీయ శౌర్యవిభవంబులఁ జూచెద నంబుజోదరా!

నాకు స్వభావసిద్ధతఁ దనర్చిన విద్య యొకండు నున్నదీ
వా కొనలో వియత్తలము నావల కెక్కియు నిక్క దచ్యుతా!
దూకుదొ నాగలోకమును దూటుచుఁ గ్రిందికి; నేర్వఁజూచినన్
నీకిది యబ్బ దోటమియు నిశ్చయమీయెడ నంబుజోదరా!

చాక్షుషమైన విశ్వము లసత్యము లూహకు నందరాని ప్ర
త్యక్షము గాని దేదొ యదె తథ్యమటంచన నౌనయేని నే
నీక్షితిఁజేయు కార్యములవెల్లను స్వప్న కృతంబు లేక దా
శిక్షకుఁబాత్రుఁ డెట్లగుదుఁ జెప్పుమ కారణ మంబుజోదరా!

యవనిక వెన్క భాగవతమట్టులు సృష్టియనంగ మాదు క
న్గవలకలక్ష్యమైన యొక నాటకమయ్యెను నీవ ప్రేక్షకుం
డవునయి దర్శకుండవయి నాడవు జీతములేని కొల్వుకాం
డ్రవుదుము మావిషాదకథ రస్యము నీ కగు నంబుజోదరా!

చలమున నింద్రియావళిని శ్వాసమునుంబిగ బట్టి పేర్చినన్
దలకొని శాస్త్రసంచయముఁ దత్పరతందుదముట్ట నేర్చినన్
దలఁపునకందరాని యొక తత్త్వము నీయది యంచెఱింగియే
యలజడిలేక ధన్యుఁడగు నాతఁడెపో ఘనుఁడంబుజోదరా!

# చుట్టాలొచ్చారు!

శ్రీ అంబటిపూడి రామకృష్ణశాస్త్రి

మా తాతగారి హయాంలో మా యింటిముందు నుంచిపోయే ప్రతి నాగన్నకీ భోజనం పెట్టి మరీ పంపించేవారుట! అది రానురాను ఇటు తిరిగి అటు తిరిగి, దారినిపోయే ప్రతి నాగన్ననూ మేమడగవలసి వస్తుందేమో అన్న అనుమానం ప్రస్తుతం నా హయాంలో పుట్టుకొస్తోంది! బొత్తిగా అంతపని జరక్కపోయినా మా యింట్లో ఉండేవారికి (మీకు చెప్పరానివారు!) నాకూ మాత్రం సలక్షణంగా జరిగిపోతోంది కాని, ఓ పట్టాన ఓ నలుగురు అతిథులొచ్చారంటే సలక్షణం కాస్తా విలక్షణం కాక మానదు!

అసలీ బస్తీ బ్రతుకులలోనే ఉంది. ఈ చీడ అంతా. ఎవడిపొట్ట వాడు పోసుకోటానికి నానా యాతనాపడి సరిగ్గా సరిపోయేట్టు సంపాదించుకోడం! మగజాతి స్థితి నానాటికి దిగజారిపోతోంది. తెచ్చే వాడు ఒక్కడూ, తినేవాళ్లు పదిమందీ. అయినా నా అంచనా ప్రకారం మరో పదేళ్ళలో మగవాడికి ఇప్పటున్నంత బరువుండకపోవచ్చు. ఎందుచేతనంటారా - ఈ అపర అబలామణులంతా చేరి ఉద్యోగులౌదామనుకుంటున్నారుగా! వాళ్లా పని చేశారంటే కాస్త ఆ మేర బరువు వీడికి తగ్గుతుంది! పైగా అతిసంతాన నిరోధోద్యమం ఎలాగూ సాగుతోంది గాబట్టి, ఆ పుట్టిన ముగ్గురు నలుగురిని ఇద్దరూ కలిసి గుట్టుగా పోషించుకోవచ్చు! అసలు విషయం మర్చిపోయాను. సహజంగా చిన్నతనంనుంచీ, ఒంటరిగా బతకడంవల్లనేమీ, పర్సులో డబ్బు లేకపోవడం వల్లనేమీ, లేకపోతే బంధువులంటే భయంవల్లనైతేనేమి నామమాత్రం బంధువులాగమనం అంటే హృదయచలనం వీగిపోతుంది! అర్ధాంగి కనుక ఆవిడ కూడా ఈ విధమైన థియరీ ప్రకారం నడుస్తుందని అంతగా చెప్పక్కర్లేదనుకుంటా! అయినా ఏమో లెండి! పక్కా గుడ్డి, చెవిటి, మూగవాడైతే తప్ప ఈ రోజుల్లో ఆడదాన్ని నమ్మలేరు!

ఈవిధంగా అటు ఆఫీసు ఒత్తిడికి ఇటు ఇంట్లో వొత్తిడికి వలలో చేపలా గిలగిలా కొట్టుకుంటున్న సమయంలో... ఓక అర్ధరాత్రివేళ చెప్పకుండా పెట్టకుండా ముగ్గురు బంధువులు దిగారు! ఎందుకైన మంచిదని నాకీ వార్త చెప్పకుండా తెల్లవారేదాకా ఉంచిందట మా ఇంట్లో ఆవిడ! చాలావరకు ముఖ్య బంధువులే. వాళ్లెవరో చెప్పడం అంత సమంజసం కాదనుకోండి! తుఫానులాగ వచ్చినవాళ్లు వచ్చినట్టు ఊరుకోకుండా పిడుగులాంటి వార్తొకటి తెచ్చారు. మరుసటిరోజు కోర్టు వాయిదా ఒకటి ఉండబట్టి, ఆ మర్నాడు మరో బంధుపటాలం రాగలదని సెలవిచ్చారు. ఆ వచ్చినవాళ్లలో ఒకాయన పేరు శంకరం! మా అమ్మ మేనత్త కొడుకులెండి.

"ఫరవాలేదులెండి శంకరంగారూ! ఎంతమంది వస్తే మనకేమిటి! బాగా ఎనిమిది మందిదాకా మన యిల్లు సరిపోతుందిగా, అంతగా చాలకపోతే చూద్దాం" నెమ్మదిగా అన్నా నాలిక కొరుక్కుంటూ. "అబ్బే నేనూ అదే చూస్తున్నానురా అబ్బాయ్! ఆవచ్చేవాళ్లు మొత్తం ఆరుగురుంటారు. పన్నెండు మందికీ ఎలాగా సరిపోవడం అని ఆలోచిస్తున్నా." పిడుగు వచ్చివచ్చి సరాసరి నెత్తినే పడింది. వచ్చిన చుట్టాలు తొమ్మిది మంది.! గుండెలవిశాయి!

"ఎంతమందొస్తే మనకేం లెండి బాబాయ్, ఏదో నా ఘటం ఉన్నంతవరకు మా పూర్వీకులలానే జరిగిపోవాలని నా సంకల్పం!"

"సంకల్పం ఉండటం మంచిదే కద్రా అబ్బాయ్! మీ తాతగారున్నప్పుడు ఇరవై ముప్పై మంది నెలల తరబడి ఉండిపోయేవాళ్లు వీళ్లన్నాళ్లు ఉండర్లే! ఓ వారం రోజులుంటారు!" చేతిలోని గరిట వదిలేసినట్లుంది మా ఆవిడ ఖంగుమని చప్పుడైంది వంటింట్లో!

నెలకో తొంభై రూపాయల జీతగాడింటికి ఓ వారం రోజులపాటు పదిమంది తింటానికొస్తే వాడికెంత బాధగా ఉంటుంది! పైపెచ్చు ఎంత కోపం వస్తుంది? చూస్తూ చూస్తూ ఆఫీసులో పనెట్లా చేస్తాడు? పోనీ ఈ బంధువులున్నారంటే వీళ్ళకేదం రోగం? ఏదో పాపం వాడూ చిన్నవాడు, ఉద్యోగస్థుడు, వాడి నెత్తినపోయి మనమంతా పడటం ఏమి

కని ఆ మాత్రం విచక్షణ అక్కర్లేదూ? పోనీ కనీసం మీరైనా ఉన్నారంటే ఏంలాభం? వారానికోసారి తీరిగ్గా కూర్చుని ఆ చివరనుంచి ఈ చివరిదాకా కథలు చదివెయ్యడం తప్ప అలాంటివాళ్ళకు సలహాలు చెప్తారు గనకనా?

బహుశా మీకందరికీ కోపంవచ్చి ఉంటుందేమో! ఏదో వాళ్లూ చుట్టాలు, రావలసినవాళ్లు, ఎన్నడూ రానివాళ్లు ఏదో పనిమీద చూసిపోదామని గాక రాక వస్తే ఈ వెధవాయి ఏమిటా ఇట్లా వాగుతాడూ అనుకుంటున్నారా? నిజంగా మీరలా అనుకుంటే ఉత్త తెలివితక్కువ వాళ్ళన్నమాట! బహుశా మీకిలాంటి అనుభవం ఎన్నడూ కలిగిఉండదు. నాకు ఎప్పుడూ కలుగుతుంటుంది. అందులోనూ నెలాఖరులోనే. మోసేబరువు గాడిదకు తెలుస్తుందన్నారు పెద్దలు. అందుకనే అర్థికశాస్త్రం వెలగపెట్టిన ప్రతి మహాశయుడూ జాగ్రత్త పడుతున్నాడు! అందుకనే "...ఐదు రోజులు జరుగును గాన తమరు సకుటుంబ బంధుమిత్ర సపరివారముగా విచ్చేసి, మత్కృత చందన తాంబూలాది సపర్యలనంది నన్నానందింపజేయ గోరుచున్నాను" అని రాయడానికి బదులుగా సివిలిజేషన్ తెరలో, "వివాహమహోత్సవ దర్శనానికి తమ ఆగమనమును కాంక్షించు" అని రాసిపారేస్తున్నారు!

రోజూ ఆలస్యంగా వచ్చే రైళ్లు గూడా ఆ రోజు సక్రమంగా వచ్చేశాయి. తత్ఫలితంగా మూడు రైళ్లల్లో ఆ పటాలం సలక్షణంగా దిగారు. మనసులో అయితే ఎన్నో అనుకుంటాం, తిట్టుకుంటాం, కొట్టుకుంటాం గాని పైకి మర్యాదగా ఉండాలిగా! అతిథుల ఆహ్వానాలు, పలకరింపులు, కుశలప్రశ్నలు, సుజనభోజనాదులు అన్నీ అయినాయి. మధ్యాహ్నం ఉత్తరం వచ్చింది...సారాంశం చెప్పమంటారా?... అయితే వినండి. మా వేలువిడిచిన మేనత్త కొడుకు ఒకడికి ఈ ఊరు బదిలీ అయిందిట, వాడు ఇంకో ఐదారు రోజులలో వస్తాడుట. ఈరోజు రాత్రికి వాడి పిల్లా మేకా, పెళ్లాం దిగుతారుట. వాళ్లని రిసీవ్ చేసుకుని ఈ వారం రోజులూ మేపి, కాపలా కాసి, వాళ్ళతో అద్దెయిల్లు చూసి, అందులోకి పెట్టాలిట!

హరి భగవాన్! దారీ తెన్నూ లేదా ఈ సాగరానికి! ఏదో మనదే అలా అలా తేలిపోతూంటే ఈ ఉప్పాసు లేమిటయ్యా మధ్య! బంధువులు, ప్రేమలు, అనురాగాలు, వియ్యాలు, కయ్యాలు, సానుభూతి ప్రదర్శనలు, సహాయాలూ, అవసరాలూ అన్నీ డబ్బు ఉన్నప్పుడు తప్పితే మిగతా సమయాల్లో అక్కరకు రావుగదా!

చాలామంది గుమాస్తాగాళ్ళకి అప్పులాళ్ళుంటారు. మార్వాడీ వాడొకడు, కోమటాయనొకడు, గుడ్డలవాడు, చాకలివాడు, బొగ్గులవాడు చివరికి మంగలివాడు కూడా అప్పులాళ్లు. నా అదృష్టమో దురదృష్టమో ఏ వొక్కరికీ నేను అప్పులేను! నేను అప్పులేను అని చెప్పుకోటంకంటె నాకు వాళ్లు "అప్పు ఇవ్వరు" అని చెప్పుకోటం మంచిది! కనుక ఇలాంటి ఆపత్సమయంలో అడ్డుపడే సాధువెవడూ లేడు ఆ భగవంతుడు తప్పితే. ఆయన మాత్రం ఏం తక్కువ? ఈమధ్య ఆయనా నేర్చుకుంటున్నాడు అడ్డుపడక పోవటం!

పోతే మా మేనత్తకొడుకు పటాలం దిగటం విషయంలో నేనంత బాధమాత్రం పడలేదు. ఈ వచ్చిన తొమ్మిది మందీ చడీచప్పుడూ లేకుండా వచ్చేశారు. కాని, మా వాడి తాలూకు ఐదుగురూ వచ్చేముందు కాస్త నోటీసిచ్చి మరీ వస్తున్నారు! అనగా వారు దిగేలోపల కావలసిన జాగ్రత్తలన్నీ తీసుకోమని ఆదేశం అన్నమాట, ఇది కాస్త మంచిపని కాదూ మరి!

ఉద్యోగస్థుడి దుర్దినాలలో ముఖ్యం 23 నుంచి 31 దాకా. ప్రస్తుతపు సంఘటన ఆ దినాల్లోనే జరుగుతోంది. బుఱ్ఱపగిలేలా ఆలోచించినా మార్గం కనపట్టంలేదు. చిల్లరడబ్బులు అవీయివీ కలిపితే ఐదు రూపాయలు కూడా లేనట్లున్నాయి. ఇలాంటి ఆపత్సమయాల్లో సలహాలివ్వడానికి చాలామందికి మిత్రులుంటారు. నాకలాంటి వాళ్లెవరూ లేరు.

ఆపద్బాంధవుడిలా సమయానికి వచ్చాడు అయ్యర్ గారు. అయ్యర్ మా ఆఫీసు ఎదురుగ్గా ఓ హోటలు పెట్టాడులెండి. అందుకని కాస్త ముఖతా పరిచయం ఉంది. అయ్యర్ గారి నవనవలాడే పచ్చని బొజ్జ చూసేటప్పటికి ఆగిపోయిన మెదడు మళ్ళీ పని చేయడం మొదలెట్టింది.

"ఏం సార్! బావున్నారా?" పలకరించాను.

"ఆ! ఎంతబాగు! కాస్త అలా అలా తిరిగి దుడ్డు వసూలు చేస్తమని బయల్దేరింతిని."

"అది సరేకానీ. మీ హోటల్లో రెండు రోజుల పాటు రూమ్ ఒకటి కావాలి."

"పరియాచక మాడుతున్నట్టుండకే. ఏల మీకు రాము ?"

"చాల అవసరం వచ్చింది సార్ ! ఏమంటారు ?"

"తీసుకోండి. నేను పోయి వస్తును."

నా తెలివితేటలకు నన్ను నేను అభినందించు కున్నాను. రహస్యంగా ఇంట్లోనుంచి వెళ్లిపోయి అయ్యరు హోటల్లో మేమిద్దరం మకాం పెట్ట బోతున్నామని పాఠకలోకానికి తెలియజేయటానికి చాలా సంతోషిస్తున్నాం. మొట్టమొదట మా శ్రీమతి ఈ ప్లాను వ్యతిరేకించింది గానీ తరువాత తరువాత ఒప్పుకోక తప్పలేదు. అతిథులంతా భోజనాలు చేసి కోట్టుకెళ్ళారు. స్టేషన్‌కెళ్లి రిసీవ్ చేసుకోడం అనేపని మానేశాను. ఇంటికి తాళంవేసి ఇద్దరం బయల్దేరబోతుండగా గొడుగు మర్చిపోయానంటూ ఒక పెద్దమనిషి వచ్చిపడ్డాడు. ఎక్కడికి ఇలా వెళ్లుతున్నారనే ప్రశ్నకి సమాధానం పావుగంట దాకా మాకు చిక్కలేదు. మా ఆవిడ మరీ కంగారుపడింది. ముఖమంతా పాలిపోయింది. ఆఖరికి నేనే సర్దుకుని చెప్పాను.

"ఏం లేదండీ ! మా ఫ్రెండు పెళ్లికి వెళ్తున్నాము. మళ్లీ రాత్రికిగాని తిరిగి రాము."

"ఓ, దానికేముంది వెళ్ళిరండి. కాస్త తాళం చెవులిలా ఇచ్చి వెళ్ళండి. మేము మళ్లీ బహుశా రెండింటికల్లా వచ్చేస్తాం."

సహస్రనామ రచన చేసేంత పాండిత్యం నాకు లేదు గానీ, ఉంటే అనువుగా ఆ పెద్దమనిషి మీదికి వదిలేసి ఉండేవాణ్ణి.

ఏం చేస్తాం ! ఇవ్వక తప్పలేదు.

అయ్యరు హోటల్లో ఆవిణ్ణి విడిచి, నేనటే ఆఫీసుకెళ్ళిపోయాను. మర్నాడు సాయంత్రం ఇంటికి బయల్దేరాం. వాళ్ళంతా వెళ్ళిపోయి ఉంటారని, తాళంవేసి, పక్కింటివాళ్లకి తాళంచెవి ఇచ్చి ఉంటారని, మా మేనత్తకొడుకు వాళ్ళంతా ఎక్కడో అక్కడ ఉండిఉంటారని ఊహాగానాలు చేస్తూ వచ్చాము. తీరా ఇంటిముందు రిక్షా ఆగేసరికి బిలబిలామంటూ ముగ్గురి పిల్లలు రిక్షా దగ్గరికి పరుగెత్తుకొచ్చారు !

మా మొహాల్లో కత్తివాటుకి నెత్తురుచుక్క లేదు. వరండాలో కూర్చుని 'గృహలక్ష్మి' చదువుకుంటు న్నారు శివరాంగారు. "ఏం అబ్బాయ్ ? పెళ్లిసందడి తగ్గిందా ? ఏమమ్మా దురీ అలా కట్టుడు చీరతోటే వెళ్ళిపోయావేం ?" ఇత్యాది ప్రశ్నలకు సమాధానాలు చెప్పడానికి మా ఆవిణ్ణి నియోగించి నేనింట్లోకి వెళ్ళాను. ఎదురుగా మా మేనత్తకొడుకు భార్య నిలుచోనుంది.

"ఏం అన్నయ్యగారూ ? కులాసాగా ఉన్నారా ? స్టేషనుకు రమ్మంటే వచ్చారు కారూ ! ఇల్లు తెలిగ్గానే కనుక్కొన్నాననుకోండి !"

"అబ్బే ! వద్దామని చాలా ప్రయత్నించానండీ ! ఏదీ కుదరలా ! అంతా క్షేమమేనా !" అన్నా ఆశ్చర్యం పట్టలేక.

జరిగిందేవిటంటే, ఈ పధ్నాలుగురు చుట్టాలూ బియ్యం అవీ ఉంటాయేమోనని ఇల్లంతా వెతుకగా, అవి లేకపోగా, వాళ్లే అన్నీ కొనుక్కొని, ఆవిడచేత వంట చేయించుకుని గడుపుతున్నారుట ! నాకు, ఆశ్చర్యపడాలో, నవ్వుకోవాలో, కోపం తెచ్చుకోవాలో తెలీలేదు. కాని, వాళ్ళ ముందుకెళ్ళనుంచోటానికి సిగ్గుతో చిక్కచచ్చిపోయాను. అయినా, వాళ్లు మాత్రం అదేంపని ? శుద్ధ మొండి ఘటాలు !!

ఆ రాత్రికి మళ్ళా వీధిలో రిక్షా చప్పుడైంది. ఈసారి ఎవరా అనుకుంటుండగా మా నాన్నగారే దిగారు ! ఇక ఆయన వచ్చాడంటే ఈ విషయాలన్నీ ఆయనే చూసుకుంటాడనుకోండి !

# వత్సలత

శ్రీ సురభి నరసింహాము

ఉయ్యాల జంపాల లూగరా నా తండ్రి!
మురిపాల గారాల ముచ్చటగ వర్ధిల్లి॥
నా పూర్వపుణ్యములు నవరీతి చివురించి
నా మనోభావనలు నేటికిటు సుమియించి
నీ రూపమున వెలసె, నాకోరికలు మురిసె
విరిసరుల ధరియించి, చిఱునగవులొలి
కించి ॥ఉ॥

"అమ్మ, అమ్మా" యనెడి అమృ
తంపు పలుకుతో
పిలువగా నా మేను పులకరించును బాబు
పులకరించిన యెదను పొంగివచ్చెడి
పాల
కడుపారగా నిచ్చి కమ్మగా పాడుదును
॥ఉ॥

పాలిచ్చి లాలింతు పాలవెల్లిగ నిన్ను
పూలిచ్చి మురిపింతు, పూలవల్లిగ నిన్ను
దరహాస చంద్రికల విరియించి వద
నాన
ముద్దు ముచ్చటలెల్ల ముందుగా నాకిచ్చి
॥ఉ॥

నామనోగేహమున నవకాంతి కలిగించి
నాభాగ్యరాశివై నా మ్రోల చరియించి
కనులపండువు కాగ మనసు వెన్నెల
కాగ
వర్ధింపుమా! తనయ! వరగుణమ్ములు
విరియ ॥ఉ॥

నీలాలముంగురులు నీ మోము పైకదల
నా భావవల్లరులు వర్ధింపగా మిగుల,
లాలిపాటలతోడ మేలియూహలమేడ
నిర్మింతు సుకుమార! నిరతమ్ము తమి
దీర ॥ఉ॥

దివ్యమౌ దీవెనలు, భవ్యమౌ లాలనలు
నవ్యరీతులతోడ నివ్వటిలగా నింక
"మాటలో మార్దవము, మనసులో
మధురిమము"
వర్ధిల్లగా, మంచి విధులెల్ల నెరవేర్చి
॥ఉ॥

అందమౌ నీమోము, అందఱను మురి
పింప
మధుభావవీచికల మునిగి తేలుదు నేను
వెలలేని, తులలేని వేడుకల నడయాడి
ఆనంద డోలికలు హాయిగా మదినూగ
॥ఉ॥




# శొంఠి — ప్రయోజనము

డా॥ శ్రీ ఎన్. హనుమంతరావు

శొంఠియొక్క పూర్వరూపము అల్లము. ఇది సాధారణముగా ఎఱ్ఱమట్టిలో పెరుగును. మెట్ట పైరుల చోట ప్రతి వ్యవసాయదారుడు కొద్దో గొప్పో అల్లమును పండించును. అందువలన బజారులలో కనబడు అల్లము ఎఱ్ఱని మట్టితో కలిసిఉంటుంది. దీనికి విత్తనము అంటూ ఉండదు. కాని వాటియొక్క ముక్కలు గణుపులు గణుపులుగా నుండును. దానినే తిరిగి మట్టిలో పాతుదురు. అది కొద్ది దినములలో తిరిగి కొమ్ములుగా పెరుగును. దీనిని ప్రతి యింట వంటకములలో వాడుదురు. అల్లము పైత్యమునకు ప్రధాన ఔషధము. జీర్ణశక్తి మరియు జఠరాగ్ని కలిగించును.

అల్లమును సున్నపు నీటిలో నానబెట్టి ఎండబెట్టుదురు. ఇట్లు ఎండించిన అల్లమునే శొంఠి యందురు.

గృహవైద్యమునకు పనికివచ్చు వస్తువులలో శొంఠి ప్రధానమైనది. ఇది సాధారణముగా అన్ని అంగళ్ళలోను లభించును. మన ఇండ్లలో కూడ నుండును. ప్రారంభ చికిత్సకు శొంఠి అతిముఖ్యమైనది. గ్రంథానుభవమేగాక నా స్వంత అనుభవముగా ఈ క్రింది ప్రయోజనములు తెలుపుచున్నాను.

1 తలనొప్పి :—తలనొప్పి వేసినపుడు శొంఠి గంధమును తలకు పూసిన కొద్ది నిమిషములలో తలనొప్పి తగ్గును. కొందఱు గృహిణులు శొంఠి గంధమును తలకు పూసి నిప్పుతో నొసలును కాయుదురు. ఇది అంత మంచిపద్ధతి కాదు. దీనివలన పైత్యము కలుగును.

2 పైత్యము :—కొందఱకు అప్పుడప్పుడు పైత్యము కలుగుటవలన తలనొప్పి, ఒంటినొప్పులు, కళ్లు త్రిప్పుట, వాంతి, బేధులు కలుగును. శరీరమంతయు నీరసము ఏర్పడును. శొంఠిని చూర్ణముగాచేసి తేనెలోగాని లేక పంచదారలోగాని కలిపి తినిన బాధలు తగ్గును.

3 కడుపునొప్పి :—ఆహారపదార్థములలో కూడ శొంఠి వాడుక కలదు. రసము, నీళ్లచారు మొదలగు వంటకములలో శొంఠిని వాడుదురు. ఇందువల్ల ఆహారపదార్థములు సులభముగా జీర్ణమగును. అంతే గాక కడుపులో నొప్పి ఉన్న తగ్గును.

4 జీర్ణశక్తి :—శొంఠి జీర్ణశక్తి కలిగించును. అందువల్లనే విరేచనమునకు తీసికున్నప్పుడు భోజనములోనికి అనుపానముగా శొంఠి, మిరియములతో రసముచేసి వాడుకొనుట మంచిది.

5 **తేలుకాటు**:- తేలు కఱచినచో, ఆ కఱచిన చోటును గుర్తించి శొంఠి గంధమును పూసి, నిప్పుతో చురుకు వేయవలెను. వెంటనే తేలుబాధ నయమగును.

6 **వాపు - కీళ్ళనొప్పులు**:- శరీరముపైన ఏ భాగములోగాని వాపు కలిగిన లేక కీళ్లు నొప్పిపెట్టిన శొంఠి గంధమును రాసి నిప్పుతో కాపవలెను.

7 **అతిసారము**:- అతిసారమునందు శొంఠి చూర్ణమును వరువేరు కషాయముతోను, గుల్మరోగమునందు తెగడ కషాయముతోను, ఆమవాతమునందు పల్లేరు కషాయముతోను ప్రతిదినము ఉదయముననే పానము చేయవలెను.

8 **పక్షపాతము**:- శొంఠిని సారాయితో నూరి పట్టువేసిన పక్షపాతము, వాతపు నొప్పులు, మేహ వాతపు నొప్పులు హరించును.

9 **కోరింతదగ్గు**:- శొంఠిని సైంధవ లవణములోగాని లేక ఉప్పునీళ్ళలో గాని అరగంటసేపు నానబెట్టి తరువాత శొంఠిముక్కను నిప్పుపై కాల్చి దాని పైపొట్టు తీసివేయవలెను. లోపలి భాగమును చూర్ణము చేసి ప్రతిదినము ఉదయము తేనెతో తినిన కోరింతదగ్గు గాని లేక ఇతర దగ్గులు గాని నివారణమగును.

10 **బేధులు**:- ఆవు మజ్జిగతో శొంఠిని నూరి ఒక చిన్న గరిటెతో దినమునకు రెండు మారులు సేవించిన బేధులు తగ్గును.

11 **మొటిమలు**:- ముఖముపైన మొటిమలు మొలచినప్పుడు శొంఠి గంధమును వ్రాయవలెను.

12 **చలిజ్వరము**:- శొంఠి, మిరియాలు, లవంగములు, పొంగించిన వెలిగారముతో సమభాగములుగా చేర్చి చూర్ణముచేసి తేనెలో కలిపి మాత్రలుగా జేసి దినమునకు మూడు మాత్రల చొప్పున మూడు దినములు వాడవలెను. వెంటనే చలిజ్వరము తగ్గిపోవును.

13 **శూలనొప్పి**:- శొంఠిని వెల్లుల్లి రసముతో మిశ్రముచేసి ప్రతిదినము ఉదయము పానముచేసిన ఎటువంటి శూలనొప్పైనను తగ్గిపోవును.

14 **వెక్కిళ్లు**:- శొంఠిని చూర్ణముగాచేసి తేనెలో కలిపి వెక్కిళ్లు కలిగినప్పుడు తినిపించవలెను.

15 **కడుపుబ్బసము**:- ఈ వ్యాధి చంటిపిల్లలకు ఎక్కువగా కలుగును. కడుపు పైకి ఉబ్బినపుడు తల్లి పాలతో అనగా చనుపాలలో శొంఠి గంధమును తీసి కడుపుపై రాసి, నిప్పుతో కాపవలెను.

16 **కషాయము**:- శొంఠిని బాగా నీటిలో ఉడికించి కషాయము తయారుచేయుదురు. దీనితో పంచదార కలిపి ప్రతిదినము ఉదయముననే నియమిత ప్రకారము సేవించిన బలమును, వీర్యవృద్ధిని, కాంతిని, మనోవికాసమును, కండ్లకు నిర్మలమును ఇచ్చును. జీర్ణము గావించును. అరుచి, శ్లేష్మము, అగ్నిమాంద్యము, అజీర్ణము, వాతము, కఫరోగము, కడుపునొప్పి, చలిజ్వరము, మలబద్ధకము, మూలవ్యాధి, కడుపులోని బల్లలు హరించును. ఏనుగుకాలు అను రోగము ఆరంభదశలో ఈ కషాయమును సేవించిన నయము కావడానికి మంచి అవకాశమున్నది.



# పశ్చాత్తాపం

'వాణి'



పోర్టికోలో కారాగిన చప్పుడు విని రాధతో ఆడుకుంటున్న ఆరేళ్ల జయలక్ష్మి, 'మా నాన్నగారు వచ్చారు' అంటూ మెట్లు దిగి పరుగెత్తింది.

ప్రకాశరావు కారుదిగి చేతిలోని బిస్కట్ ప్యాకెట్ కూతురికందిచ్చాడు. ఇద్దరూ లోపలికి వస్తూ ఉండగా ప్రకాశరావు మెట్లమీద బెదురు చూపులతో నిల్చున్న రాధను చూశాడు.

'ఆ పాప యెవరు బేబీ ?' అని ప్రశ్నించాడు. అసలు పేరు జయలక్ష్మి అయినా ప్రకాశరావు మాత్రం ఆ పేరుతో పిలువలేక 'బేబీ' అనేవాడు.

"మన వీధిలోకి క్రొత్తగా వచ్చారు నాన్న ! మా స్కూల్లో నాలుగో క్లాసు చదువుతూంది," అని బేబీ వెళ్లి రాధ చేయి పుచ్చుకొని తీసుకొచ్చి సోఫాలో కూర్చోబెట్టింది.

రాధ మొహంలోకి పరీక్షగా చూసిన ప్రకాశరావు ఉలిక్కిపడ్డాడు. విశాలమైన ఆ కళ్లు తనకు పరిచితమైన యెవరినో జ్ఞప్తికి తెస్తున్నాయి.

'అదేమిటి ? రాధవైపు అంతపరీక్షగా చూస్తున్నారు. బెదిరిపోగలదు' అన్న భార్య విమల మాటలతో తేరుకొని ట్రేలోని కాఫీకప్పు అందుకున్నాడు.

రాధ బేబీ ఆడుకొందుకు కాంపౌండులోకి వెళ్లిపోయారు.

♦ ♦ ♦

ప్రకాశరావు రాధను అప్పుడప్పుడు పలుకరించేవాడు. ఆ పాప నమ్రత, తెలివితేటలు ఉట్టి పడే మొహం అతన్నెంతో ఆకర్షించాయి.

'బేబీని నీవే మాత్రం అదుపులో పెట్టలేకుండా ఉన్నావు. రాధ తల్లి యెంతో నేర్పరై ఉండాలి,' అంటూ విమలను దెప్పిపొడిచేవాడు.

రాధ, బేబీ ఆడుకోవడం చూస్తూ పరధ్యానంగా ఉండి పోయేవాడు. రాధ కళ్లు తన గత జీవితాన్ని గురించి నిలవేస్తున్నట్లుండేవి.

అ నాడు రాధ పుట్టినరోజు. స్వీట్సు పట్టుకొని క్రొత్తగౌనుతో రాధ బేబీవద్దకు వచ్చింది. తమదగ్గరే కూర్చున్న తండ్రికి బేబీ లడ్డూ చేతిలో పెట్టింది.

'ఈ వేళ నా పుట్టినరోజు,' అన్నదిరాధ. 'క్రొత్త గౌను యెవరు కుట్టించారు రాధా ?' ప్రకాశరావు సరదాగా అడిగాడు.

'మా మామయ్య కుట్టించాడు. మా అమ్మ జ్వరంలోనే లేచి స్వీట్సు చేసింది,' అన్నది.

'మరి మీ నాన్నగారెక్కడ ఉన్నారు ?' అప్రయత్నంగా అతని నోటివెంట వెలువడింది. ఆ ప్రశ్న వినగానే రాధ మొహం క్షణకాలం కళావిహీనమైంది.

'నేనెప్పుడూ మా నాన్నను చూడలేదు. నాకు తెలీదు,' అన్నది దిగులుగా. ప్రకాశరావు చాలబాధ పడ్డాడు.

'మీ మామయ్య పేరేమిటి ? ఏం చేస్తున్నారు ?' ఎన్నడూ అడగని వివరాలు తెలుసుకోవాలనే కుతూహలం కలిగింది.

'మా మామయ్య గవర్నమెంటు డాక్టరు, పేరు రఘు,' ప్రకాశరావు త్రుళ్లిపడ్డాడు.

'మీ అమ్మ...?' ప్రకాశరావు స్వరం వణికింది.

'మా అమ్మ పేరు జయ, బి. ఏ. ప్యాసయింది. నా పాఠాలన్నీ మా అమ్మే బోధపరుస్తుంది,' రాధ కళ్లు గర్వంతో మెరిశాయి. ప్రకాశరావు తలతిరిగిపోయింది. ఆలోచనలు కొన్ని సంవత్సరాల వెనకకు పరిగెడుతున్నాయి. క్రోధమూ, బాధా నిండిన మనస్సుతో కుర్చీలో వెనుకకు వాలిపోయాడు.

♦ ♦ ♦

ప్రెసిడెన్సీ కాలేజీలో చదువుతూ జీవితాన్ని మధురంగా గడుపుతున్న రోజులవి. బి. ఏ. లో జయ తన క్లాసుమేటు. జయ తెలివైంది, ఆకర్షణీయమైన రూపంకలది.

స్టూడెంట్సు యూనియన్ సెక్రెటరీ అయిన

ప్రకాశరావుకు చలాకీగా ఉండే జయతో పరిచయమైంది. అతని వాగ్ధోరణి, సుందర రూపం ఆమెను ముగ్ధురాలని చేశాయి. మెరీనా బీచీ, కానిమెరా లైబ్రరీ వారిని కొన్నాళ్ళకు సన్నిహితుల్ని చేశాయి.

జయకు తల్లిదండ్రులులేరు. యం. బి. చదివే రఘు ఆమె తమ్ముడు.

హృదయాలు పరస్పరానురాగ పూరితాలుకాగా, బి. ఏ. ప్యాసయిన తరువాత జయ, ప్రకాశరావు వివాహం చేసుకున్నారు. స్నేహితులంతా చాల ఆనందించారు. కాని వారిక్లాసు మేటయిన సురేష్ మటుకు బాధ పడ్డాడు, అతడూ జయను నిండు మనస్సుతో ప్రేమించాడు, కాని ఆమె హృదయ వీణతీగెల్ని మాత్రం తనవైపుగా స్పందింపజేసుకోలేక పోయాడు, అయితే సభ్యతగల వ్యక్తి కావడంవలన పైకేమీ వ్యక్తపఱచలేదు. ప్రకాశరావు ఉద్యోగంలో చేరాడు. యూనివర్సిటీలో ఎమ్. ఏ. చదివే సురేష్ అప్పుడప్పుడు వారి యింటికి వచ్చేవాడు. పూర్వపరిచయాన్ని పురస్కరించుకొని జయ కూడ మాట్లాడేది.

సురేష్ రావడం ప్రకాశరావు కంతయిష్టం ఉండేదికాదు. అదీ కాక ఒక స్నేహితుడివలన సురేష్ భగ్న ప్రేమ విషయం విన్నాడు, అప్పటి నుండి అతని మనస్సు పాడైంది. కాని జయకీ విషయాలు తెలియవు. సురేష్ వెళ్ళిపోయాక యేదో వంకతో జయను కసిరేవాడు. నిండు హృదయంలో జయచూపే ఆదరాభిమానాలు మాత్రం ప్రకాశరావులో అనుమానానికి తావు లేకుండా చేసేవి.

జయకు పాపపుట్టే సూచనలు కన్పించాయి. పురిటికి పంపవలసిందిగా విశాఖపట్నంలో ఉంటున్న ఆమె మేనమామ వ్రాశాడు. కొద్ది రోజులకు జయ అక్కడికి వెళ్ళిపోయింది.

ప్రకాశరావు తండ్రి కాబోతున్నట్లు తెలిసి ఫ్రెండ్సుహర్షం వెలిబుచ్చారు. సురేష్‌పట్ల మటుకు అతను విముఖంగా ఉండిపోయాడు.

♦ ♦ ♦

జయకు కుతూరు పుట్టింది. ఆమెను తీసుకొని రావడానికి ప్రకాశరావు వెళ్ళాడు.

మాటల సందర్భంలో జయ, 'ఈ మధ్య సురేష్ యీ ఊరువచ్చాడు, మన పాపకు యీ కప్పు ఫ్రాకు యిచ్చాడు.' అని చెప్పింది. ప్రకాశరావు హృదయం భగ్గుమంది. ఆమె చేతిలోని కప్పు ఫ్రాకు విసిరేశాడు.

'సురేష్‌తో నువ్వు మాట్లాడకూడదని అతని ప్రస్తావన మన మధ్య రాకూడదని లక్షసార్లు చెప్పాను. కాని నీకు అతనంటే అభిమానం. అందుకే అతన్ని గౌరవిస్తున్నావు. ద్రోహివి,' అనుమానం ద్విగుణీకృతంకాగా ఆవేశంతో అరిచాడు. జయ నిర్ఘాంత పోయింది.

'సురేష్ మనయిద్దరి క్లాసుమేటు. సంస్కారం గల వ్యక్తిగా అర్థం చేసుకొని సోదరుడుగా గౌరవించాను. నన్ను నమ్మండి. నా సర్వస్వం మీరే,' జయ నల్లని కళ్ళలో నీళ్లు సుళ్లు తిరిగాయి.

'నన్ను మాటలతో మధ్య పెట్టడానికి ప్రయత్నించకు జయా! కల్మషపూరితమైన హృదయం కలిగిన నిన్నిక నా భాగస్వామినిగా గౌరవించలేను,' అతని ఆవేశం హద్దులు దాటింది. జయకు తలపై పిడుగుపడినట్లు అయింది. కన్నీళ్ళతో భర్తను అర్థం చేసుకోమని వేడుకుంది. తల్లి దండ్రులు లేని తనను లేని పోని అపోహలతో దూరం చేసుకోవద్దని విలపించింది. కాని అతని రాతి హృదయం కరగలేదు. నిష్కారణంగా యేర్పడిన దురభిప్రాయంతో ఆమెకు దూరంగా వెళ్ళిపోయాడు.

దుర్భరమైన ఒంటరి జీవితాన్ని, నోరులేని పసిపాపను తల్చుకొని జయ కంపించిపోయింది.

జయకు వచ్చిన కష్టానికి రఘు చాల బాధపడ్డాడు. రఘు చదువు పూర్తి చేసి గవర్నమెంటు డాక్టరుగా కాకినాడ వెళ్లాడు, ఎప్పటికైనా ప్రకాశరావు మారక పోడనే ఆశతో అక్కా తమ్ముళ్లు రోజులు గడప సాగారు, జయ ఆవేదనతో కృశించసాగింది.

ప్రకాశరావులో గూడుకట్టుకున్న ద్వేషం జయ నిర్దోషిత్వాన్ని గురించి ఆలోచించ నివ్వలేదు. నేరం చేస్తూన్నట్లు ఫీలవుతూనే విమలను పెళ్లి చేసుకున్నాడు. కాలక్రమాన పరీక్షలు ప్యాసయి ఆఫీసరుగా కాకినాడకే వచ్చాడు. కాని మానసికంగా అతనికి శాంతిలేకపోయింది.

♦ ♦ ♦

ఏడు సంవత్సరాల తరువాత యీనాడు తన

యెదురుగా నిల్చున్న రాధ జయ పవిత్రతనుసవాల్ చేస్తున్నట్లులోచింది. అమాయకంగా తన వైపు చూస్తున్న రాధను అప్రయత్నంగా దగ్గరకు తీసుకున్నాడు.

'నాన్నను చూడాలని ఉన్నదా రాధా?' అని అడిగాడు.

'అవును మా నాన్నగారు తప్పకుండా వస్తారని సురేష్ మామయ్య యెప్పుడూ చెప్పేవాడు,' అన్నది.

'సురేష్ మామయ్య! ప్రకాశరావులో క్రొత్త ఆలోచనలుదయించాయి. సురేష్, జయ నిరపరాధులేమో! నిజమాలోచిస్తే పెళ్ళినాటికి సురేష్ తన కంటె అన్ని విధాలా ఉన్నతస్థితిలో ఉన్నాడు. ఆకర్షింపబడే అన్ని గుణాలూ అతనిలో ఉన్నాయి. కాని జయ తనను వివాహం చేసుకుంది. తన జీవితంలో ఆనందాన్ని పరుగులెత్తించింది. ఎంతమధురంగా ఉండేవి ఆ రోజులు! వారి స్నేహాన్ని తనే అపార్థం చేసుకున్నాడేమో! 'నాన్నా! యీ రోజు సినిమాకు వెళ్దామన్నారుకదూ!' బేబీ మాటలతో అతను ఆలోచనల్లోంచి తేరుకున్నాడు.

◆ ◆ ◆

ఆవేదనతో, మానసిక సంఘర్షణతో బలహీనుడైన ప్రకాశరావు వారంరోజుల సెలవు అనంతరం ఆఫీసులో అడుగు పెట్టాడు. రాధ ఆ నాటినుండి రాలేదు.

అన్యమనస్కంగా పేపరు తిరగేస్తున్న ప్రకాశరావు, 'బాబాయ్' అన్న రాధ పిలుపుతో ఉలిక్కిపడ్డాడు.

"మా సురేష్ మామయ్య మిమ్మల్ని చూస్తానంటే తీసుకొచ్చాను," అన్నది రాధ.

'ఆతను నీకు బాబాయ్ కాదు రాధా! మీ నాన్నగారే,' అన్నాడు సురేష్. ప్రకాశరావు తలెత్తి చూశాడు. సురేష్ స్వచ్ఛమైన నవ్వు అతన్ని కలవరపరిచింది.

'అకారణమైన అపోహతో జయ నీకు దూరమవడం సహించరాని విషయం ప్రకాశం! ఆమె నాకు సోదరివంటిది. అమాయకురాలు. నీ కోసం కృశించి చావుబ్రతుకుల మధ్యనున్న ఆమెను యిప్పటికైనా అర్థం చేసుకోవడం నీ కర్తవ్యమనుకుంటాను. నీవు ఊహించే అక్రమసంబంధం మా మధ్యలేనేలేదు. ఇప్పటికైనా నమ్ము ప్రకాశం! ఈ పాపను దగ్గరకు చేర్చుకో;" సురేషు బాధతో అతనికి నచ్చచెప్పాడు.

రాధ వింతగా యిద్దరివైపు చూస్తూంది.

'వెళ్ళిపో సురేషు! ఇక్కడినించి వెళ్ళిపో!' ప్రకాశరావు పిచ్చిగా అరిచాడు.

జయ దీనవదనం పదేపదే జ్ఞప్తికి రాసాగింది. సురేష్ మాటలు అతన్ని వెన్నాడుతున్నాయి. జయ నిర్దోషి అని అంతరాత్మ ఘోషించసాగింది. ఇంక అతను నిలువలేకపోయాడు. జయను చూడటానికి బయలుదేరాడు.

హాస్పిటల్ గుమ్మంలో విచారవదనంతో రఘు యెదురైనాడు. ప్రకాశరావు చూసీ చూడనట్లు వెళ్ళబోయాడు. కాని అతను 'రఘూ' అంటూ చేయి పట్టుకున్నాడు.

'ఏం కావాలి?' విసుగ్గా అడిగాడు.

'జయను చూడాలని రఘూ!' అన్నాడు.

'ఎందుకు? ఆమెను బాధించడానికి యింకేమైనా క్రొత్తకారణాలు సృష్టించుకు వచ్చారా?' తీవ్రంగా అడిగాడు. ప్రకాశరావు నేరస్థునివలె తలవంచుకున్నాడు.

'నేనామెకు ద్రోహమే చేశాను రఘూ! ఒకసారి చూపి మనశ్శాంతిని పొందనియ్యి. ఇంకానన్ను అపార్థం చేసుకోకు రఘూ!' ప్రార్థనాపూర్వకంగా అడిగాడు.

ఇద్దరూ జయ ఉన్నరూములోకి వెళ్ళారు. రాధ 'అమ్మా,' అంటూ హృదయవిదారకంగా యేడుస్తూంది.

ప్రకాశరావును చూడగానే జయ కళ్ళలో వేయి దీపాలు వెలిగాయి.

'నేను వచ్చాను జయా! నన్ను క్షమించవూ!' దీనస్వరంతో కన్నీళ్ళు కార్చాడు.

'మిమ్మల్ని చూడగలిగాను. నాకది చాలు. రాధను పెద్దకూతురుగా చూసుకోరూ,' జయగద్గద స్వరంతో అన్నది.

'మీ నాన్నగారు!' రాధ తల కుప్పహస్తాలతో నిమిరింది.

'రాధా! రామ్మా!' అంటూ వాత్సల్యంతో చేతులుచాచి దగ్గరకు తీసుకున్నాడు.

'రాధను ఒక్కనాటికి అన్యాయం చేయనుజయా!' అని ఆమె చేతిని ప్రేమతో తన చేతిలోకి తీసుకున్నాడు.

ఆ వేదనలు దూరంకాగా తృప్తిగా శ్వాస వదిలింది జయ.

# అమాయకురాలు

శ్రీ ప్రయాగ సీతారామశాస్త్రి

ఆ రోజు వుదయం తొమ్మిది గంటలప్పుడు అనూరాధ ఒంటరిగా తన గదిలో కూర్చోని వుంది. బావ వచ్చినప్పటినుంచి యింట్లో పరిస్థితులన్నీ తారుమారయ్యాయి. ఏమిటో అర్థం కాదు ఆ వాతావరణం పదేళ్ళ అనూరాధకి. ఎవర్ని అడిగినా తనకు కావలసిన సమాధానం చెప్పరు. ఇదివరకు తను, అక్క ఒకే మంచంమీద పడుకుండేవారు. ఇప్పుడు అక్క తనదగ్గిర పడుకోవడంలేదు. రాత్రి భోజనాలయాక పరాయి వాడైన శేఖరం బావ దగ్గిర కెళుతుంది. మళ్ళీ తెల్లవారితే గాని రాదు. బావకూడా భోజనానికి తప్ప మేడమీదినుంచి దిగిరాడు. ఏమైనా సరే! ఈ రోజు అనసూయ అక్కను ఈ విధంగా అడుగుదామని తీర్మానించుకొని అక్క గది దగ్గిరకి వెళ్ళేసరికి అక్క గదిలో లేదు. ఛీ! బావ వచ్చిన తరువాత అక్కతో మాట్లాడటానికే వీల్లేకపోతుంది. ఆమె దర్శనాలు మరీ కరువై పోతున్నాయి. మళ్ళీ నేమో అక్క నాకు నీతులు చెపుతుంది. 'ఈడొచ్చిన ఆడపిల్లలు జోడైన మగవారితో యిష్టం వచ్చినట్లు మాట్లాడరాద'ని. తనేమో ఎవరో గుంటూరు వాస్తవ్యులు పరంధామయ్యగారి ఏకైక పుత్రుడట శేఖరం బావతో ఎందుకు మాట్లాడుతుంది? అసలు అక్క కూడా బావకు జతయింది. మేడ మీదికి వెళ్ళిందంటే దిగిరాదు. అదేం ఖర్మమోగాని! బావతో ఎప్పుడూ నవ్వుతూ, హుషారుగ మాట్లాడుతుంది. మధ్య మధ్యలో ఆ బావ ఏదో ఇంగ్లీషు మాట అని బుగ్గమీద చిటిక వేస్తాడు. పరాయి మగవాడితో మాట్లాడరాదనే అక్కయ్య ఆయన (బావ) చేత బుగ్గమీద చిటిక వేయించుకొంటుందా! అప్పుడప్పుడు జడ పట్టుకొని లాగుతూవుంటాడు. 'అబ్బ! యేం సరసం అండీ?' అంటూందేగాని ఒక్కసారైనా కోప్పడదు. నేనైతేనా ఈ పాటికి బావని గోళ్ళతో రక్కేదాన్ని. పాపం! అక్క అమాయకురాలు కాబట్టి వూరుకుంది. ఎంతసేపని తను ఒక్కతే అక్క గదిలో కూర్చొంటుంది. అక్కను పిలుద్దామనుకొంది. అంతలో మేడ మెట్లు దిగి వస్తున్నట్లు గుర్తుగా అక్క కాలి మెట్టెల చప్పుడు వినిపించింది. పైనుండి, 'మళ్ళీ ఎప్పుడొస్తావు?' అన్న బావ కంఠం, దానికి సమాధానంగా 'ఒక్క అరగంటలో' అన్న అక్క గొంతూ వినపడ్డాయి అనూరాధకి. ఇంకా తన అదృష్టం బాగుంది. కనీసం అర గంట సేపైనా అక్కతో కులాసాగా మాట్లాడుకోవచ్చు అనుకుంది అనూరాధ. 'అక్కా!' అన్న అనురాధగొంతు వినపడేసరికి అనసూయ తన గదిలోకి చూచింది. చెల్లెలు అనురాధ దిగులుగా

కుర్చీలో కూర్చొని, తన కోసమే! అన్నట్లు జాలిగా తన వంక చూచింది.

'అనూ! ఈరోజు స్కూలుకి వెళ్ళలేదా?' అని ప్రశ్నించింది అనసూయ, అనూరాధని.

'బావ వచ్చిన తరువాత నీకు మరీ మతి పోతున్నదక్కా! ఈ రోజు ఆదివారం కదూ!' అని సమాధానమిచ్చింది.

'మరచి పోయేనే! ఆది వారమే! అయితే నన్నిప్పుడు ఎందుకు పిలిచావు?' అని అడిగింది అనసూయ.

'ఒకటి అడుగుతాను ఏమీ అనుకోకుండా సమాధాన మిస్తావా అక్కా!' అని అడిగింది అనురాధ అక్కని.

'నీకు జవాబు చెప్పందెప్పుడే అనూ!' అని అన్నది అనసూయ.

'బావ వచ్చిన తరువాత దర్శనాలే కరువయ్యాయి. దానికేంగాని రాత్రి పూట పరాయివాడు శేఖరం బావదగ్గిర కెళతావెందుకక్కా?'' ప్రశ్నించింది అనురాధ.

అనసూయకు తలతిరిగినంత పనైంది. రోజూ అనురాధని నిద్రపుచ్చే తను పైకి వెళుతున్నది. అయినప్పటికి తను పక్కలో ఎప్పుడు వుంటున్నదీ! లేనిదీ! గ్రహిస్తున్నది అన్నమాట.

'జావాబు చెప్పు అక్కా!' అని బలవంతం చేసింది.

'అది నీకూ కూడా పెళ్ళయిన తరువాత తెలుస్తుంది. ముందరగా చెప్పగూడదు. పెళ్ళయిన తరువాత అమ్మ చెప్తుంది. ఈలోపల ఎవరన్నా చెపితే చెప్పినవాళ్ళ తల పగిలిపోతుందట' అని చెప్పి ఈ మాట ఎవ్వరికీ చెప్పకూడదని చెప్పింది అమ్మ' అని బొంకింది అనసూయ.

'నిజంగా తల పగిలి పోతుందక్కా?' అని మళ్ళీ అడిగింది.

'లేకపోతే నీకు ఎప్పుడన్నా అబద్ధం చెప్పానా! చెప్పు అనూ -' అని అంది అనసూయ

'తల పగిలిపోతే చెప్పద్దులే అక్కా! నా మూలంగా నీ తలపగిలితే నాకింకా అనసూయ అక్క ఎవరుంటారు? అది సరే గాని! మొన్న ఒకసారి బావ నీజడలాగితే పూరుకున్నావెందుకక్కా? అమ్మతో చెపితే తల వాచి పోయేట్లు చివాట్లు వేసేదిగా!' అని సావధానంగా అడిగింది అనూరాధ తన అక్కని.

'అసలు ఆయన నన్ను జడపట్టుకెప్పుడు లాగారు?' అని తెలియనట్లు ఎదురు ప్రశ్నించింది అనసూయ!

'మొన్న ప్రొద్దున నీళ్ళు తోడి ఇదిగో సబ్బు, ఇదిగో తుడుచుకోను టవలు, నే లోపలికి వెళుతున్నా'నని బయలుదేరి వస్తూండగా అక్కా బావ జడపట్టుకు లాగలా? అప్పుడక్కా! అమ్మతో ఎందుకు చెప్పలా?' అని పుస్తకంలో పాఠంచూచి చదివినట్లు గడగడా మాట్లాడింది.

'ఓసి నీ! ఇవన్నీ నీ వెప్పుడు చూచావే!' అంది.

'అప్పుడు నేను అన్నంతిని చేయి కడుక్కోటానికి దొడ్లో కొచ్చానక్కా' అని సమాధానమిచ్చింది.

'ఆయనకు నా జడను చూస్తే నల్లని త్రాచులా బాగుంటుందిట. అందుచేత ఆయన అప్పుడప్పుడు అలా అంటూ వుంటారు' అని తప్పుకుంది అనసూయ.

'అయితే నీవు స్కూల్లో చదువుకుండే టప్పుడు నీజడ ఎవ్వరికి నచ్చలేదా?' అని ప్రశ్నించింది.

'ఏమో! అది నాకెట్లా తెలుస్తుంది!' అని సమాధానమిచ్చింది.

'ఎవరూ లాగలేదా'' అని మళ్ళీ ప్రశ్నించింది అనూరాధ.

'ఎవరన్నా ఆ పని చేస్తే అమ్మతో చెప్పేదాన్ని' అని జవాబిచ్చింది.

'అయితే ఈయన చేస్తే ఎందుకు చెప్పలా?' అని మళ్ళీ అడిగింది.

'ఆయన చేసినవి అమ్మతో చెపితే రాత్రికి అక్కడకు వెళ్ళినప్పుడు గొంతు పిసికి చంపుతారు తెలుసా!' అంది.

అంతలోకి అమ్మ కంఠం 'అన్నానికి లేవండి!' అని సైరన్ కూసినట్లు వినిపించింది.

'అక్కా నీకో వుపాయం చెవుతాను. తరువాత భోజనానికి వెళదాము. ఏమంటావ్? అని అనూరాధ అంది.

'సరే! చెప్పు' అని సమాధానమిచ్చింది అనసూయ.

''అయితే ఆయనకు కనపడకుండా తిరుగు. పొరపాటున ఎప్పుడన్నా తటస్థపడితే ఆయన పాడు బుద్ధి పోనీరు (అంటే జడలాగటం మొదలైనవి) అప్పుడు అమ్మతో చెప్పి చివాట్లు పెట్టించవచ్చు. రాత్రి పూట ఆయన దగ్గిరికి పోకుండా నాదగ్గిరే పడుకో - అప్పుడు అమ్మతో చెప్పావని గొంతు పిసకడానికి వీలుండదు. ఏం? బాగుందా!' అని ప్రశ్నించింది.

'అయితే నీ పక్క దగ్గిరికి వచ్చి నా గొంతు పిసికితే!' అని తనకు సందేహం వున్నట్లుగా గాలిలోకి విసిరింది ఆ మాటలను అనసూయ.

'నేను మేలుకొని వుంటాను. ఆయన నా పక్క దగ్గిరికి వచ్చినప్పుడు పెద్దగా 'అమ్మా అని కేకేస్తాను. సరేనా!' అని అనసూయ సందేహానికి సమాధానమిచ్చింది. పాపం! అమాయకురాలైన అనూరాధ.

మళ్ళీ తల్లి కంఠం కొంచెం కటువుగా వినపడింది. ఇద్దరూ భోజనాలకు వెళ్ళారు.

ఆరోజు అక్క పగలు పైకి పోనందుకు 'తన మాటను అంగీకరించింది. అక్క' అనుకొని సంతోషించింది అనురాధ.

# సమత్వాదర్శ విషయము

బ్రహ్మశ్రీ గుమ్మడిదల వెంకటసుబ్బారావు

  

ఈ శీర్షిక క్రింద యింతవరకు వేదవాఙ్మయము లోని స్త్రీల విషయము, కాల క్రమేణ అన్యమత ముల ప్రభావముచే యిచ్చట గలిగిన మార్పులు, నేటి భారతస్వాతంత్ర్యావతరణమునకు బిమ్మట యిచ్చట అవతరించవలసియున్న సంపూర్ణ స్త్రీ స్వరూప విషయముల గూర్చి చర్చించి యుంటిమి. ఈ వ్యాస ములో ప్రపంచమునంతయు కలవర పరచు చున్న "సమత్వ"ము విషయమై పరిశీలించవలసియున్నది. ఏలయన యిప్పటి మననారీలోకమున ఆందోళన పరచుచున్న సమస్యలన్నిటిలో యీ స్త్రీ పురుష సమానత్వ విషయమొక ముఖ్యవిషయముగ బరిణ మించినది.

## ఆధునిక సమానత్వము

ఆధునిక ప్రపంచవ్యవస్థలో యీ "సమానత్వ" (Equality) ఆదర్శమును మానవ సమస్యలలో ప్రస్ఫుటముగ బయటకు దెచ్చిన దేశము అమెరికా. 1776 సంవత్సరములో అచ్చటిప్రజలు తమ స్వాతం త్రమును ప్రకటించుకొన్నప్పుడు "జన్మవల్ల మానవు లెల్లరు స్వతంత్రులు; సమానత్వము అందరియొక్కయు జన్మహక్కు" అన్నసూత్రమే వారి స్వాతంత్ర ప్రకటనలోని ముఖ్యభాగము. కాని యీప్రకటనలో "సమానత్వ" మనగా వారి దేశములోని ప్రజలను అప్పటికిని, యిప్పటికిని కొంతవరకు కలవరపరచు చున్న "తెలుపు నలుపు" – అనగా యూరోపియన్ నీగ్రోవిభేదములనుద్దేశించిన సరిసమానత్వమే. కాని గత 175 యేండ్లలో యీ ఆదర్శము ముందు పాశ్చా త్యదేశములందును, క్రమేణా మనదేశమునకును సంఘ ములోని జాతి,మత, కులవర్ణాదులకే గాక, స్త్రీ పురుష (లింగ) సమానత్వమునకును వ్యాప్తిజెంది, యిప్పుడిది దాదాపు యావత్ప్రపంచమునందును యొక ప్రధాన ఆదర్శమై వెలయుచున్నది. ఈ యుద్యమఫలితమే మన రాజ్యాంగమునందలి 15వ సూత్రములో "భారతీయ పౌరులలో యెట్టి మత, జాతి, వర్ణ, లింగ, స్థలవిభేద ములను పాటించకూడదు యను" నిబంధనచట్టబద్ధమై యున్నది. కాని కారణాంతరములచే, మన సంఘ ములో వెనుకబడిపోయిన స్త్రీలకును, నిమ్న జాతుల కును, విద్యావిషయములోను, తదితర విషయము లందును కొన్ని ప్రత్యేక సదుపాయములు చేయ వచ్చుననియు రాజ్యాంగము శాసించుచున్నది. ఈ రెండు సందర్భములందును స్త్రీలహక్కులను భారత రాజ్యాంగము స్పష్టముగగుర్తించుచున్నది.

## సనాతన భావము

కాని ఆచరణ విషయమెట్లున్నను, కనీసము ఆదర్శవిషయముననైనను యీ సమానత్వభావము కేవలము పాశ్చాత్యము, ఆధునికము మాత్రమే కాద నియు; అనాదినుండియు మన పూర్వులును యీ ఆదర్శమును గుర్తించి, గౌరవించుచుండుటచేనిది యిచ్చట సనాతనమేననియు విజ్ఞులగు వారు తేలికగ గ్రహింపగలరు. ఉదాహరణ : భగవద్గీతలో

> విద్యావినయ సంపన్నే బ్రాహ్మణేగవి
> హస్తిని।
> శునిచైవశ్వపాకేచ పండితాస్సమ
> దర్శినః॥ (౫.౧౮)

(అనగా విద్యావినయ సంపన్నులగు వారు బ్రాహ్మ ణుని, గోవును, ఏనుగును, కుక్కను, చండాలుని, సమముగజూతురు.)

ఇందు స్త్రీల విషయము ప్రత్యేకముగ జెప్పబడ లేదుకాని యేనుగునందును, కుక్కయందును నిషేధిం పబడిన అసమానత్వము స్త్రీలయందు పాటింపదగునని గీతాచార్యులుద్దేశింతురా ? ఆ విషయమెట్లున్నను, అంతకుపూర్వమే మనువు స్త్రీశూద్రాదుల విషయమై కొన్ని కఠిననియముల నేర్పరచినను, ఎచ్చట స్త్రీలు గౌరవింపబడుదురో యచ్చట దేవతలును తృప్తు లగుదురనియు, పురుషులు తమ స్త్రీలను సర్వవిధ ముల సంతోషుల జేయుట మానవ ధర్మమనియు శాసించియుండెను. బౌద్ధకాలమునాటికి ప్రబలిన

సాంఘిక అసమానత్వమును కొంతవరకు మార్చుటకై బుద్ధుడు పురుషునితోపాటు స్త్రీకి గూడ “సంఘములో సభ్యత్వమును, సన్యాసార్హతయు ప్రసాదించెనని లోగడమనము చదివితిమి. అతనికి బిమ్మట శ్రీ ఆది శంకరులునుతము “అద్వైత” సిద్ధాంతమునందీసమత్వముగూర్చి యిటుల వాక్రుచ్చెను.

యశ్యాంతర్నాది మధ్యమ్ నహికర
చరణమ్ నామ గోత్రం
నసూత్రం నోజాతిర్నైవవర్ణా నభవతి
పురుషోనానపుంసం
నచస్త్రీః నాకారం నైనకారం నహిజ
నిమరణమ్ నాస్తి
పుణ్యమ్ నపాపమ్ తత్వంనోత త్వమే
కం సహిజ
సమరసం సద్గురుం తన్నమామి॥

ఇందు గోత్ర సూత్రములు, జాతివర్ణముల భేదములే కాక, లింగవిషయములో స్త్రీ పురుషులతోపాటు నపుంసకులకును సమానత్వము శాసింపబడుటయు, సద్గురుస్వరూపము తుదకు పుణ్య పాపములకును అతీతమనియు నిరూపించ బడుట గమనార్హము. ఈ విషయములో శ్రద్ధగ బరిశీలించినచో అధునిక “సమానత్వ” భావమునకంటె మనసనాతన అద్వైత భావమెంత సువిశాలమునూ, ఉత్కృష్టమైనదో తత్వవేత్తలు గ్రహింపగలరు. ఇందలి లింగ విభజనములో నపుంసకులను ప్రత్యేకవ్యవస్థగ బరిగణించిన భారతజాతి సృష్టి వైపరీత్యముచే నుత్పన్నమైన యీ తృతీయ వర్గీయులకు మన సాంఘిక నిర్మాణములో నెట్టి అర్హస్థానమొసంగ బడినదో మన శాస్త్రమును, సంఘమును బరిశీలించినవారు గ్రహింపగలరు.

## ప్రస్తుత విభేదములు

ఇందలి తత్త్వైక్యత విషయమెట్లున్నను వ్యవహార ప్రపంచములో యీ స్త్రీ పురుష భేదములు నేటి భారత సంఘములోనే కాక యావత్ప్రపంచమునందు పెక్కుచోట్ల మహాఘోరముగనే కన్పట్టుచున్నవి. ఉదాహరణ ముఖ్యముగా దేశమందు విద్యాస్వరూపిణియగు సరస్వతికే వేదార్హత నిరాకరింపబడుచున్నది. లక్ష్మీ స్వరూపిణియగు స్త్రీకిని, విష్ణుస్వరూపుడగు పురుషునకును ఆస్తి హక్కుల విషయమై చాల తారతమ్యమున్నది. ఇటులనే శక్తిస్వరూపిణియగు స్త్రీ పురుషుని యెదుట “అబల”యే అగుచున్నది. ధర్మవిషయమున గూడ, మన పూర్వులు ఏర్పరచిన నోములు, వ్రతముల ఆచరణవల్ల యింకను మన స్త్రీలలో పురుషులలో కంటె హెచ్చు ధర్మచింతన, ధర్మాచరణ యగుపడుచున్నను, మన పురుషులలోకంటె స్త్రీలలో యింకను హెచ్చు ధర్మనీరసత్వమును, సదాచారమునకు మించిన దురాచారము, మూఢభక్తియు ప్రబలియున్నవి. వీటి అన్నిటి మూలమునకు పెక్కుచోట్ల మన స్త్రీలు నిస్సహాయులై, ఆర్థికముగను, సాంఘికముగను దాదాపు అన్ని జీవితరంగములందును నొక “వెనుకబడిన జాతి”గ నేర్పడుచున్నారు. గత నలభై యేభై యేండ్లనుండియు ఇచ్చట వెలసిన భారత నారీ యుద్యమములవల్లగాని, తదితర దేశకాలపరిస్థితులందలి మార్పులవల్లగాని, యీ దుస్థితి కొంతవరకు యిటీవల సడలుచున్నను ధర్మసమ్మతమగు నొక మహావిప్లవ మవతరించినగాని యిచ్చటి పరిస్థితి వలయునంతగ మారునని తోచదు. ఇట్టి మార్పుకు కేవలము రాజ్యాంగ చట్టమునందలి “స్త్రీ సూక్తములు” చాలవు. అస్పృశ్యత దోషమని రాజ్యాంగము శాసించుచున్నది. కాని సంఘములో యీ అస్పృశ్యతా నివారణ యెంతవరకు కొనసాగుచున్నది? “తాటాకులలో” వ్రాసినంతమాత్రాన సాంఘిక సంస్కరణలు కొనసాగునా ?

## పురుష శాసనములు

మన దేశమునందేగాక, యావత్ప్రపంచమునందును యీ స్త్రీ పురుష భేదములకుగల ముఖ్యకారణములలో వీరి శాసనకర్తలలో స్త్రీలకు తగు ప్రాతినిధ్యము లేకుండుటయే యని తోచును. ఉదాహరణ: యిచ్చట వెలసిన అనేక స్మృతిరాజములలో యొక్క స్మృతియైనను స్త్రీ రచయితము కాదు. పాశ్చాత్య పార్లమెంటులలోను, యిప్పటికిని స్త్రీల సంఖ్య నూటికి పదిమందియైన నుండదు. పాశ్చాత్య శాసనములన్నియు పుంలింగ రూపముననే యుండును (అనగా “వాడు” యని). వాటిని స్త్రీలకు గూడ అన్వయింపజేయుటకు మాత్రము “వాడు అనగా ఆమె యనియు గ్రహించునది” యని ఒక నిబంధనను జేర్తురు ('He' includes 'She). ఇందు 'She' లో

'He' యుండునో, 'He' లో 'She' యుండునో పాఠకులే యూహించుకొనగలరు. ఇటులనే 'woman' లో 'man' యుండునుగాని 'man' లో 'woman' యెన్నడైన యుండునా?

మన భారతీయ సంప్రదాయములో సృష్టి క్రమమును చిత్రించుటకై శ్రీ ఆదిమహావిష్ణువు బొమ్మలను మనము చూచుచుందుము. అందు శేషతల్పశాయియగు మహావిష్ణువు సుఖాసీనుడై యుండుట, ఆతని పాదసేవకురాలుగ శ్రీ యాదిలక్ష్మి వెలయుట మనము కనుచున్నాము. ఇట్టి రూపమే మన జాతి ఆదర్శమైనచో యిచ్చట పురుషులందరు సాచుకొని పడుకొనేవారు, స్త్రీలు పురుషులకు కాళ్లు పిసికేవారు కాకుందురా? ఇందుకు మారుగ నొక స్త్రీ రూపమునకు పురుషుడు పాదసేవ చేయుచున్న ప్రతిమలను మన కళాకారులలో నెవ్వరైన చిత్రింప సాహసింతురా? చిత్రించినను, మన యిప్పటి పురుష సంఘము అట్టి చిత్రములను గౌరవించి, ఆదరించునా? నిజమే! యిచ్చటి రాధాకృష్ణ తత్వములో నొక పవిత్ర కార్తీక పున్నమినాడు రాత్రి గోపీవల్లభుడు తన ప్రేయసి పాదపద్మములను పసుపు పారాణీలతో నలంకరించెనట. కాని యిట్టి సమత్వాధర్మము నేడు మన సంఘములో నెంతవరకు ఆచరణలో నున్నది? అనునదే యిప్పటి ప్రధాన ప్రశ్న. వర్ణ ధర్మములను సుదీర్ఘముగ శాసించిన మనువే భోజన విషయమై బిడ్డలు, సేవకులు, స్త్రీలు భుజించిన పిమ్మటనే గృహస్థుడగు పురుషుని భుజించుమని చెప్పెను. కాని యీరోజున ఆ మనుధర్మ శాసన మెంతవరకు ఆచరణలో నున్నది? పురుషుని ఉచ్ఛిష్టమును మాత్రమే చాలమంది స్త్రీలు భుజించుట లేదా? పూర్వము "వారు నవాబులు, లేక దొరలు - మనము గులాములము" అని మన ప్రజలలో నుండెడి రాజకీయ స్వభావమే నేటి మన సంఘమునందును యీ స్త్రీ పురుషుల విషయమై విశేషముగ ప్రబలియుండలేదా? "వాళ్లు మగవాళ్లు - వాళ్ల తర్వాతనే, వాళ్లు తినగా మిగిలినదే, మనము తినెదము" అను భావమిప్పటి మన స్త్రీలలో యెంతవరకు వ్యాపించియున్నదో, అట్టి భావముతోనే మన పురుషులు తమ మాతృమూర్తులయెడ, తమ సోదరీ బృందమునెడ, తమ "ప్రియురాండ్ర" యెడ, తుదకు తమ బిడ్డలఎడ, యెట్టి "సగర్వము"తో, ఎట్టి విగ్రహీతనముతో పాటించుచున్నారో మన మెరుగుదుము. శూద్రులందువలెనే యీ స్త్రీలయందును సంబోధనా విషయమై ఏకవచన, బహువచన ప్రయోగము లెంతవాలుతో యున్నవో ఒకసారి మనము ఆత్మవిమర్శన గావించుకొందుముగాక!

## ప్రపంచ సమస్య

ఈ పురుషాధిక్యతా భావమొక్క భారత జాతిలోనే కాదు - అన్యజాతులందును, అన్యమతములందును, చాలకాలముగ వ్యాపించిన రుగ్మత యని తోచుచున్నది. ఉదహారణ:

మహమ్మదీయుల మత గ్రంథమగు ఖురాన్‌లో నిట్లు చెప్పబడియున్నది. "ఓ మానవుడా! నీవు నీ సృష్టికర్తకు భయపడుము. ఆతడు మున్ముందుగ నిన్నును, తదుపరి నీ భార్యను సృజించెను. మీ యుభయులనుండి యాతడనేకమంది స్త్రీ పురుషులను సృష్టించెను. భగవంతుడు స్త్రీ కంటె పురుషునికి యెక్కుడు గుణసంపద నొసంగెను. అందుచే స్త్రీ కంటె పురుషుని అధిక్యత మెండు...ఋజువర్తనులగు స్త్రీలు వినయవిధేయతలు గలిగి, తమ భర్తలు హాజరు లేని సందర్భమున (తమ కుటుంబ సంసార విషయమునను, తమ గౌరవమర్యాదల గురించియు) జాగ్రత్త వహింతురు. అందుచేత భగవంతుడు స్త్రీలను పురుషుల రక్షణకు వప్పజెప్పెను."

ఇటులనే మిల్టన్ అను ఆంగ్ల కవీశ్వరుడు ఆదమ్‌తో అవ్వ యిటుల బలికెనని వ్రాసెను:

"ఓ సృష్టికర్తా! లయకర్తా!
నీ యాజ్ఞలను నేను మారుజెప్పక యే
శిరసావహించెదను.
అది భగవన్నిర్మాణము.
భగవానుడు నీ శాసనము - నీవు నా
శాసనకర్తవు.
ఇంతకుమించి తెలుసుకొనకుండుటయే
స్త్రీకి ఆనందము, విజ్ఞానము,
గౌరవము."

షేక్స్పియరు మహాకవి డాంబికము (variety) దుర్బలత్వము (frailty) స్త్రీ లక్షణములు వర్ణించెను.

గౌతమబుద్ధుడు తన సంఘములో స్త్రీలకు ప్రవేశమొసంగుటకు మొదట నంగీకరించలేదు, కాని యాతని

పినతల్లి గౌతమి సభ్యత్వము గోరినప్పుడు, అతని శిష్యుడు ఆనందుని బలాత్కారముపై యెట్టకేలకు ఇయ్యకొనెను. అయినను వేయేండ్లు జీవించవలసిన తన సంఘము స్త్రీల ప్రవేశముచే అర్ధాయుష్కమగు ననియు; సంఘీయులగు స్త్రీలకు సంపూర్ణ నిర్వాణమునకు అర్హత యుండదనియు అతడు వాక్రుచ్చెనట. అందుచే అంతటి విశాల ధర్మమగు బౌద్ధములో గూడ స్త్రీలకు సంపూర్ణ సమత్వము లభించలేదు.

అరబ్బి సంఘములో పురుషులకు బహు భార్యాత్వము, స్త్రీలకు జనానా పద్ధతులవల్ల స్త్రీల స్థితి యెట్టి అధ్వాన్నస్థితికి వచ్చెనో యెల్లరెరింగినదే. ఇటులనే మొన్న మొన్నటివరకు చైనీయులలో యీ స్త్రీ పురుష సమత్వమున్నది మృగ్యమనియే తోచును. వారిలో బహు భార్యాత్వమేగాక బహిరంగముగ నుంపుడుకత్తెలను గూడ యింటిలో నుంచుకొనుట పురాతనాచారమట! ఇట్టి దురాచారములన్నియు ఇటీవల అచ్చట జరిగిన ప్రజావిప్లవములో తుడిచిపెట్టబడినవని చెప్పుదురు.

ఇటులనే వివిధ దేశములలో వివిధ సంఘకర్తలు, గ్రంథకర్తలు, స్త్రీలపై పురుషుల ఆధిక్యతను శాసించి, చాలకాలముగ చెలాయించుచు వచ్చిరి. ఇందువల్ల పెక్కుమంది స్త్రీలలో నొక విధమగు నిమ్నత్వమేర్పడినది. కేరళ, మలయా మున్నగు కొద్ది ప్రాంతములందు స్త్రీలకు కొన్ని హక్కులేర్పడిన సందర్భములలో "అదొక ఆడ మళయాళము"ని పురుష నాగరికత హేళనచేయుచు వచ్చినది. ఇట్టి పరిస్థితులలో నవప్రపంచములో స్త్రీల స్థితి యెట్లుండదగునను ప్రశ్న ఉదయించుచున్నది. ఇందుకు సమాధానమునకు పోకపూర్వ మీ "సమత్వ" ధర్మము గూర్చి మరికొంత లోతుగ బరిశీలించుట యవసరము.

(సశేషము)

# శ్రీ రామ కర్ణామృతము

(ఆంధ్రానువాదము)

చతుర్థాశ్వాసము

శ్రీ కల్లూరి అహోబలరావు



(గత సంచిక తరువాయి)

సీ. ౧

శ్రీ సముద్రుని గర్వంబుఁ జెందియాడ
రామ! లోక భీకర భంగి - రౌద్రనేత్ర
ములను, విచ్చితి వాగంగ మోము వాల్చెఁ
'దనదు' మంగళ సూత్ర విధ్వంస మగునో?
యంచుఁదలఁచుచు, దివిజులుగాంచి, చింత
నల్పిరంత సముద్రుఁడుత్సాహమతిని
శరణువేడ, రక్షించితి శాంతుఁడగుచు
రఘుకులానంద! శ్రీరామ! ప్రణుతిశతము

సీ. ౨

ఆశ్రితమందార! అంబుధి గర్వాప
హార! సీతా చిత్తచోర! రామ!
శ్రితజన రక్షణాయతచిత్త! దేవతా
రక్షణ తత్పర! రాఘు వేశ!
కర్ణకుండలధార! కమనీయ దేహ! త్రి
లోకపూజిత! కరుణా కటాక్ష
వీక్షణములు, భక్త రక్షణ తత్పరుఁ
డయి, ప్రసరింపు నాపయి, ముకుంద!
జానకీ చిత్తపద్మ భాస్కరుడ వీవు!
లోకముల, శుభంకరుఁడవు-శ్రీ కరుఁడవు!
చిన్మయానంద మూర్తివి; మన్మనఃక
మలమున - వసింపు; ప్రార్థనములనోనర్తు

సీ. ౩

శ్రీరామ! జనియించి - చెలువుగాబాల్యంబు
గడపి, కౌశికుని యజ్ఞంబుఁగాచి
శాపమహల్యకుఁబాపి, ముక్కంటిధ
నుర్భంగ మొనరించి, నుతులఁగొంచు,
సీతను పెండ్లాడి - చేరియరణ్యంబు
సతినిఁ గోల్పోయి, విచారమంది
హనుమంతుచే లంకయావత్తు చిచ్చొంద
వారిధిదాటి, రావణునిఁ గొట్టి
రక్కసుల మూకఁజెండాడి లక్ష్మణుండు
మూర్ఛఁగొనఁదేర్చి, జానకీముగుదఁగొంచు
వచ్చినాడవయోధ్యకు సచ్చరిత్ర!
సుకథ - రామాయణంబిదే - సుజనవినుత

సీ. ౪

శ్రీరామ! జన్మించి - గౌరవంబునను, వి
శ్వామిత్రుయజ్ఞ రక్షణమొనర్చి
ముక్కంటి చాపంబు - ముక్కముక్క
లొనర్చి
జానకిఁబెండ్లాడి - సంబరమున
భక్తితో పితృవాక్య - పరిపాలన మొనర్చి
విపిన సంచారంబు - వేడ్కసలిపి
ధనువుజేఁబూని, యుద్ధమున - ఖరాదుల
సంహార మొనరించి - జాగులేక
మాయలేడిన్ని మర్దించి - మగువసీత
కొఱకు, లంకాపురముజొచ్చి-క్రూరుఁడైన
రావణుని వధించితివోర! రాఘవేశ!
మహి,నిదియకాదే గొప్పరామాయణంబు

౫౫

భూనాథ ! రామ ! తపోవనమందు, బం
గారు కురంగంబు గాఢ బాణ
తతులఁగొట్టితివి ! సీతను, రావణుండు-హ
రించె ! జటాయువ్వధించె ; నంత
సుగ్రీవుతో మైత్రిఁ జూరగొంటివి ! వాలి
వధియించితివి ! ప్రేమ పవనసుతుఁడు
నీ సేవలొనరించె ; నీరధిదాఁటె ; లం
కాదహన మొనర్చె ; మీఁద నీవు
కపి బలంబున వారిధిఁగట్టి, లంకఁ
గుంభకర్ణ - రావణులను గూల్చి, సీత
తో నయోధ్యఁజేరితి వీవు ! తోయజాక్ష !
ఇదియె - రామాయణంబందు రెల్ల జనులు

౫౬

రఘురత్నమ ! బహుశరత్కాలచంద్రులఁ
బురుడించు నీ నవ్వుముద్దు మోము
చంద్ర సూర్యాగ్నుల సాటిఁ బ్రకాశించు
కుండల శోభితాంగుండ వీవు !
జపమాల, వీణ, పుస్తకము, జ్ఞానంపు, ము
ద్రయు, హస్తములయందుఁదాల్చితీవు!
దేవతాధిపుఁడవు ! దివ్యస్వరూప ! ల
క్ష్మణ,భరతాదులు - మమతతోడ
నీకు సేవసలుప నీల మేఘశ్యామ !
రామ చంద్ర ! వరద ! శ్రీమహేశ !
వన్నెకెక్కినావు : భక్తినిన్ భజియింతు
కావు మయ్య నన్నుఁగరుణతోడ

౫౭

తపను గుఱ్ఱంబులు దప్పుద్రోవకువెళ్లె
ముక్కంటి శిరమూఁచె - ముగ్ధుఁడగుచు;
కులపర్వతములు, వ్యాకులమంది చలి
యించె,
విస్మయుంబొందెను వేధ యపుడు ;
దిగ్గజంబుల కెల్లఁదెలివి తేటలు దప్పి,
ఘోరంబుగాఁ గల్గెఁదొట్రుపాటు ;
సప్తసముద్రముల్ - స్తంభించి బెగ్గడె ;
మూఁడులోకంబులు - మూర్ఛమునిఁగె.
మద బలోద్ధతు లింకిరి ; ముదమునొందె
సీత ; శివధనుర్భంగంబు చేత పుట్టి
నట్టిశబ్దంబు శ్రోత్రేంద్రియములసోకి
నంత - శ్రీరామ ! నీచర్యలద్భుతములు !

౫౮

కర్ణకుండలధారు కారుణ్యపాత్రు
నీరజదళనేత్రు - నీరదగాత్రు
ఇనవంశశోభితు - నిందిరారమణు
లక్ష్మణాన్వితు, రఘురామునిఁదలఁతు.

౫౯

తళుకు మెఱుపులతోఁ దళతళల్
గొలుపు
నీలమేఘశ్యాము - నిగమవందితపాదు
విద్యాధర స్తోత్రు - వీరావతారు
శత్రుల మర్దించు సాహసోపేతు
లక్ష్మణాన్వితు, రఘురామునిఁదలఁతు.

౬౦

దివ్యబాణములచే - దీపించు కార్ము
కంబును గల్గిన - కమనీయగాత్రుఁ
బాథోధి గర్వంబుఁ బాపినరాము
సుగ్రీవమిత్రు, విశుద్ధచరిత్ర
రాక్షసజైత్రు, శ్రీరాజీవనేత్రు
లక్ష్మణాన్వితు, రఘురామునిఁదలఁతు.

౬౧

అచ్యుతానందుఁ, బీతాంబరధారు
ఇంద్రామరస్తోత్రు - నిందీవరాక్షు
నాజానుబాహువు -నాదిత్యతేజు
లక్ష్మణాన్వితు, రఘురామునిఁదలఁతు.

(సశేషము)

# నిరుపమ

మూలం :
"నిరాల"

అనువాదం :
"అరుంధతి"

(గతసంచిక తరువాయి)

"ఎవ్వరైనా అడుగుతే బజారుకు వెళ్లానని చెప్పు" అంటూ నిరు నీలిని తీసుకొని మేడ దిగి, యే సంకోచము లేకుండా ధైర్యంతో తిన్నగా కుమార్ యింటికి వెళ్లింది. నీలి తలుపు తట్టింది. తలుపులు దగ్గరగా చేరవేసి వుండటంవల్ల తోసేసరికల్లా తెరుచుకున్నాయి. లోపల దీపం వెలుగుతోంది. నిరు లోపలికి వెళ్లింది. సావిత్రిదేవి అప్పుడే పొయ్యిమీదనుండి అన్నం దించి నెయ్యి వెచ్చబెట్టుతోంది. మాలిగ్వాతల్లి ఒక ప్రక్కగా కూర్చుంది. రామచంద్ర గదిలో చదువుకుంటున్నాడు.

మొదట నీలి పిలవడంతో - నీలి ఒక్కత్తె రాలేదు. నిరుపమ కూడ వచ్చేవుంటుంది - అని అనుకుంటోంది. వీళ్లిద్దరూ పైకి వచ్చేశారు. "కూర్చోవమ్మా. ఇప్పుడే వస్తాను" అంటూ సావిత్రిదేవి నేతిగిన్నె క్రిందకు దింపి లోపలికి వెళ్లింది. నీలి కూడ ఆమె వెనకాలే వెళ్ళింది. రామచంద్ర చదువులో నిమగ్నమై వుండటం వల్ల వీళ్లు వచ్చిన సంగతే గమనించక, గదిలోకి రావడంతోనే చిరునవ్వుతో లేచి నిలబడ్డాడు. నిరు అతని ప్రక్కగా వెళ్ళి "బాగా చదువుతున్నావా, రామూ", అంటూ అతన్ని నిమురుతూ అతని ప్రక్కనే మంచంమీద కూర్చుంది.

సావిత్రిదేవి వెనకాలే లోపలికి వెళ్ళిన నీలి, "యీవాళ మీరు అన్నం తినరేమోనని వచ్చింది మా అక్క" అంది.

సావిత్రిదేవి నవ్వి, "అయితే చెప్పు. యీ వేళే తినిపించడానికి వచ్చిందా? యెప్పుడూ తినిపించడానికి వచ్చిందా?" అంది.

వయస్సు చిన్నదైనా నీలి సావిత్రిదేవి మాటల్ని గ్రహించి నవ్వుతూ, "యెప్పటికీ" అంది. ఆ మాట సావిత్రిదేవికి చాల గంభీరంగా వినబడింది. లేత హృదయం యెప్పుడూ సత్యమార్గాన్నే చూపిస్తుంది అనుకుంది సావిత్రిదేవి. ఈ మాటలు నిరు వింటూనే వుంది. ఆమె హృదయం సంతోషంతో పొంగిపోయింది.

సావిత్రిదేవి వంటింట్లోంచి వచ్చి — తన ఆశయం నెరవేరిందా అన్నట్లు మంచంమీద కూర్చున్న నిరుపమను ఆశతో చూచింది. ఆమె ప్రక్కనే మంచం మీద కూర్చుని వీపుమీద నిమురుతూంటే నిరుపమ పెంపుడు జంతువులా చూస్తూ కూర్చుంది. బెంగాలీ భాషలో మాట్లాడుతూ నిరుపమను ప్రక్క గదిలోకి తీసుకువెళ్ళింది. సావిత్రిదేవి చేతిలోని ఉత్తరాన్ని చూచి నిరు కళ్లు దించేసింది.

"నిరూ! హృదయంలోని భావాలు యెప్పటికైనా దాగుతాయా? హృదయంలోని భావాలు హృదయంలోనే అణగద్రొక్కి యెంత బాధపడ్డావు! నేను ఆ నాడే నీలి మాటలు విని గ్రహించుకున్నాను. ఆ తర్వాత నిన్ను కల్సుకున్నప్పుడు నిర్ధారణ చేసుకున్నాను..." అంటూ చేతిలోని ఉత్తరాన్ని చూపెట్టి, "చెప్పు నిరూ! యీ కన్నీరు నీదేనా?..." అంది.

"మీరు తల్లిలాంటివార్కు, మీ దృష్టిలో భ్రమ అనేది లేదు."

"అయితే యీ వ్యవహారంలో నువ్వుకూడ కష్టపడాల్సి వస్తుంది. అప్పుడే నువ్వనుకున్నది సఫలీకృతమౌతుంది. కేవలం నేను నీకు అనుకూలంగానే వుంటాను."

"అలాగే..." అంటూ చిరునవ్వుతో, "కమల సంబంధంలో భ్రమ అనేది కలుగకపోతే యెప్పుడో..."

ఆమె మాటను అర్థం చేసుకుని సావిత్రిదేవి నవ్వి, "అయినా నువ్వు చాలసార్లు సంకేతాలిచ్చావు... కుమార్ పుస్తకాలు అక్కడ టేబులుమీద వున్నాయి. ఏదో ఒక పుస్తకం తీసుకుని మంచంమీద పడుక్కొని విశ్రాంతిగా చదువుకో. నేనింతలో వంట పూర్తి చేసి వస్తాను. భోజనంచేసి వెడుదువుగాని... ఇంతలో కుమార్ కూడ వస్తాడు..."

సరేనంటూ నిరు వెళ్ళి పుస్తకం తీసుకుంది. కొద్ది

సేపట్లోనే కుమార్ వచ్చాడు. అతని వెనకాలే వున్న కమలను చూచి "యీవాళ మా భాగ్యం" అంది సావిత్రిదేవి నవ్వుతూ. గదిలోవున్న నిరుపమను చూచి చిరునవ్వుతో 'ఓ' అంటూ సావిత్రిదేవి వైపు తిరిగి, "మా భాగ్యంమాత్రం యెందుకు కాకూడదో!" అనేసి నిరు ముఖంలోకి చూచింది కమల. నిరు సిగ్గుతో తలవంచుకుంది. ఎవ్వరూ మాట్లాడలేదు ఒక క్షణంకాలం. "మేము మాత్రం యీ వేడివేడి పదార్థాలన్నీ యెందుకు తినకూడదో...అవును లెండి... కోడలు స్వంతవస్తువు కనక నేతితో చేసిన పిండివంటలన్నీ పెట్టడం జరుగుతుంది..." అంటూ కమల జవాబుకోసం యెదురు చూడకుండానే గదిలోకి వెళ్లి నిరు ప్రక్కన కూర్చుని, కుమార్‌తో అంది-"ఉపాయే నహి యచ్ఛక్యం న తచ్ఛక్యం పరాక్రమే-అన్నారు పెద్దలు."

"అంటే..."

"చూద్దువుగాని నల్లత్రాచును యెల్లా ఆడిస్తానో నువ్వే చూస్తావుగా. ఈ వ్యవహారంలో ఆఖరికి యెలా తుది మెరుగులు పెడ్తానో చూద్దువుగాని..."

నిరు యేమీ మాట్లాడలేదు. చిరునవ్వు నవ్వి వూరుకుంది. కుమార్ పేపరు చదువుకుంటున్నాడు. ఎవ్వరూ మాట్లాడకపోవటం గమనించి _ కమల మళ్లీ అంది _ "పరిస్థితిని అర్థంచేసుకున్న వాళ్లెవరైనా యిక్కడ వుంటే - అది నీలి ఒక్కత్తే. ప్రపంచంలోని రహస్యాలన్నీ ఆమెకు అర్థమౌతాయి. ఈ వయస్సులో చేసేపనుల్లో అందం, ఆనందం వుంటాయి. చేసేవాళ్లకి చూచేవాళ్లకి కూడ ఆనందంగా వుంటుంది. ఈ వ్యవహారంలో నీలి బాగ ఉపయోగపడుతుంది..." అంటూ నీలివైపు తిరిగి, "ఏం నీలీ! డాక్టరుగార్ని ఆటబొమ్మలాచేసి ఆడించాలి. ఏం?" అని నవ్వింది. నీలి నవ్వి వూరుకుంది.

"ఒకవేళ మీవాళ్లు అడిగితే యీ విషయాలన్నీ చెప్తావా?"

"ఎవరడిగితే?"

"మీ నాన్నగాని - మీ అన్నగాని...యెవరైనా సరే..."

"చెప్పను."

"మీ నాన్నగారు, అన్నయ్య నిన్ను కొట్టినా సరే చెప్పకూడదు. ఏం.. నిరూ...నువ్వు మాత్రం చాల ఖచ్చితంగా వుండాలి. మనస్సు కఠినం చేసుకోవాలి. అనుమానానికి ఆస్కారం లేకుండా వుండాలి. అన్నట్లు...ఆ సేన్ రోడ్డులో వున్న మీ యిల్లు ఖాళీగానే వుందికదూ?"

"ఆ వున్నట్లుగానే వుంది..."

"అయితే ఆ యిల్లు బాగు చేయించు" అంటూ నిరును తీసుకుని మేడమీదకు వెళ్ళింది కమల. "నిరూ! నువ్వేమీ పసిపిల్లవు కావు. నీ కన్నీ తెలుసును. మీ మేనమామ _ వాళ్లు యెటువంటివాళ్లో నువ్వెరుగుదువు. ఈ నాలుగు రోజుల్లోను యింకా తెలుసుకుంటావు కూడా..." అంటూ కమల జాకెట్టులోంచి ఒక ఉత్తరాన్ని తీసి యిచ్చి, "దీన్ని చదువు" అంది. నిరు చదువుతూ కోపంతో నిలబడలేకపోయింది.

"అర్థమైంది కమలా. ఇన్నాళ్లు యేమో అనుకున్నాను. వాళ్ళు చెప్పిన ప్రతి విషయంలోను గ్రుడ్డిగా అనుసరిస్తూ వచ్చాను"

"సేన్ రోడ్డులో వున్న మీ యిల్లును బాగు చేయించి వెంటనే నువ్వు అక్కడికి వెళ్ళిపోవాలి. ఈ నాలుగు రోజులు నువ్వు అక్కడే వుండాలి. పెళ్లి కూడా ఆ యింట్లోనే జరగాలి. నువ్వు ఆ యింట్లోకి వెళ్ళగానే అన్ని విషయాలూ ఆయనకు స్పష్టంగా అర్థమయ్యేటట్లు మీ మామయ్యకు ఒక ఉత్తరం వ్రాయి. వాళ్ళు చేసే అక్రమాలు, అన్యాయాలు అన్నీ నీకు తెలుసునని ఉత్తరం చదువుకోగానే వాళ్లు గ్రహించుకోవాలి. వాళ్ళ సహాయమేమీ నీకు అక్కర్లేదు. నీ సహాయమే వాళ్లకు కావాలి. వాళ్ళకేది కావలసినా నువ్వు చెయ్యవలసిందే _ ఇదివరలో చేశావు. ఇకముందు కూడ చెయ్యబోతావు...ఇక అక్కడ చెయ్యవలసిన ఏర్పాట్ల సంగతి - మేడమీదకు యెవ్వరూ రాకూడదు. పెళ్లికి ముందరే అందరూ అక్కడికి రావాలి. అంతవరకూ యెవ్వరూ లోపల అడుగు పెట్టడానికి లేదు. భోజనాలు, మగపెళ్లివారికి కావలసిన యితర యేర్పాట్లు. అన్నీ మీ మేనమామే చూచుకోవాలి. ఇతర విషయాలలో ఆయన కలుగజేసుకోకూడదు. నువ్వు యెవ్వరినైనా కల్సుకోవాలంటే క్రిందికి దిగి రావలసిందే కాని యెవ్వరూ పైకి రావడానికి లేదు. ఈ ఉత్తరాన్ని చూచి వాళ్లేమైనా అనుకుంటారేమోనని అనుకుంటావేమో! ఒకవేళ కొద్దిగా బాధపడ్డా-

మరేం భయంలేదు. ఇదంతా యామినీబాబే చేయిస్తున్నాడని అనుకుంటారు... తర్వాత... పెళ్లి మాత్రం హిందూపద్ధతిలో చెయ్యాలని వ్రాయి. హిందూ పురోహితుణ్ణి ఏర్పాట్లు చెయ్యాలని చెప్పు..." అంటూ యింకా ఏమిటో చెప్తూండగానే రామచంద్ర భోజనానికి పిలవడానికి వచ్చాడు. అతణ్ణి కమల పట్టుకుని, "రామూ! యీవిణ్ణి నువ్వేమని పిలుస్తావు?" అంటూ నిరును చూపెట్టింది.

"అక్క" అన్నాడు నవ్వుతూ.

"అబ్బే, అట్లాకాదు. 'ఒదినా' అని పిలవాలి."

"ఇంకా పెళ్లి కాలేదుగా..." అంటూ నవ్వి పారిపోయాడు.

## 25

మరునాడు ఉదయమే యామినీబాబు కాన్పూరు ప్రయాణమై నిరు దగ్గరికి వచ్చాడు.

"వివాహం మామ యింట్లో అవడానికి వీల్లేదు"

"అయితే మరెక్కడ?" అన్నాడు ఆశ్చర్యంగా.

"మా యిల్లు వుందిగా. సేన్ రోడ్డులో వున్న మా యిల్లు ఖాళీగానే వుంది. పెళ్లివారు అక్కడికే రావాలి. మామతో మీరు చెప్పండి — పెళ్లి అక్కడే జరగాలని. ఇక యిక్కడ యెక్కువ కల్పించుకోవడం నా కిష్టం లేదు..."

యామినీబాబు అంతా విని యోగేష్‌బాబు దగ్గరకు వెళ్ళి అన్నీ వివరంగా చెప్పి, కాన్పూరు వెళ్ళిపోయాడు.

కమల ప్రొఫెసరు దుబే దగ్గరకు వెళ్ళింది. అలా ఆయన దగ్గరకు వెళ్ళి మత, సాంఘిక సమస్యలపై ఆయనతో చర్చిస్తూ వుండటం కమలకు పరిపాటి.

"ఏమండి ప్రొఫెసరుగారూ! క్రైస్తవులుగా వుండటంవల్ల ఆర్థికంగా లాభాలేమీ లేవుగదండీ! కాని హిందువుల్లో వుండటంవల్ల - కొన్ని లాభాలున్నాయి. మీరెందుకు హిందువుల్లో కలియకూడదు? పోనీ అది మీకిష్టం లేకపోతే ఆర్యసమాజం వుండనే వుంది. ఈ రెండింటికి అట్టే తేడాలేదు. క్రిష్టియన్లకు ముస్లిములకు యెంత తేడావుందో యీ రెండింటికి అంతే తేడా" అంటూ అందులో వున్న ఆర్థిక, సాంఘిక, ధార్మిక లాభాలన్నీ ఆయనకు తెలియచెప్పింది. తర్వాత ఊళ్లోవున్న పెద్దపెద్ద వాళ్ళందరికీ కమలే నిరు వివాహానికి ఆహ్వానాలు పంపించింది. చూస్తూ వుండగానే చేయవలసిన పనులన్నీ పూర్తి చేయించింది.

ముహూర్తం రోజు దగ్గరికి వచ్చేసింది. నిరు వుంటున్న మేడచుట్టూ ఎనిమిది మందిని, ఒకణ్ణి గేటు దగ్గర, మరొకణ్ణి మేడమెట్లు దగ్గర గూర్ఖావాళ్లను కాపలాపెట్టింది. మేడ ముందర పెద్ద పందిర. కనుల పండుగగా రకరకాల ఎలక్ట్రిక్ దీపాలు వెలిగించారు. పందిట్లో ఒకప్రక్కన పెద్ద పర్షియన్ తివాసీ వేశారు. మరొక ప్రక్కన మగపెళ్లివారికి ప్రత్యేకంగా కుర్చీలు వేశారు. పెళ్లివారందరూ వచ్చారు. వచ్చే ప్రముఖుల్ని ఆహ్వానించి కూర్చోపెడుతున్నారు. పందిరి నిండా ఘుమఘుమ వాసనలతో మత్తెక్కిపోతోంది, ఒకప్రక్కన ప్రసిద్ధ గాయకురాలొకామె పాట పాడుతోంది. యామినీబాబుకోసం ప్రత్యేకంగా వేసిన వేదిక పాశ్చాత్య పద్ధతిలో బెంగాలీ అనుకరణతో చూడ్డానికి చాల అందంగా కనపడుతోంది. ఒకవైపు వచ్చినవాళ్ళకు భోజన యేర్పాట్లు జరుగుతున్నాయి. యోగేష్‌బాబే అంతా స్వయంగా నిర్వహిస్తున్నాడు.

ఆడవాళ్లందరూ నియమానుసారం ముహూర్తం కొద్ది క్షణాలుందనగా వచ్చారు. వాళ్లందర్నీ ఆహ్వానించి కూర్చోబెట్టే భారం కమలపై పడింది. ఎవ్వరూ పైకి వెళ్ళడానికి లేదు. పెళ్లికి చేసిన యీ ఏర్పాట్లు కట్టుదిట్టాలు చూచి యిదేదో నవీనపద్ధతి అనుకున్నారు కొంతమంది సనాతనులు. నిరుపమ తాలూకువాళ్లు మాత్రం యిదంతా యామినీబాబు కల్పన అనుకున్నారు. అందుకనే అసలు ముగ్గురు ఆడవాళ్లుంటే చాలు ముల్లోకాలు చుట్టేస్తారంటారు. నిరు పాపిడికింది, జడగంటలు మొదలైనవాటితో అలంకరించుకుని నీలిని వెంటబెట్టుకుని ఆడవాళ్లున్న వసారాలోకి వచ్చింది. ఆచారానుసారం అందరి దగ్గరికి వెళ్ళి నమస్కరించింది. అందరూ ఆమెను చిరునవ్వుతో ఆశీర్వదించారు. అయినా ఒకామె ఏమీ అనకుండా ఊరుకోలేక వ్యంగంగా అంది - "వివాహం హిందూ పద్ధతిలో జరిగేటప్పుడు బెంగాలీ పద్ధతిలో యీ మండపం యెందుకో!"

(సశేషము)

# చిక్కనమంత్రి

(అన్నిహక్కులు రచయితవి)

సాహిత్య సరస్వతి శ్రీ సీరిపి ఆంజనేయులు



శ్రీయనంతాత్ము సుశ్రీశోభితాంశు
సృష్టికారకుని విశిష్టపాలకుని
నిఖిలలోకారాధ్యు నిగమాంత వేద్యు
మహితశుభోన్నతు మనమార నెంచి,
చిక్కన ప్రెగడ జీవితచరితం౧
సాగింతు సరళప్రశస్త వాక్సరణి.

దక్షిణాపథమున దండకారణ్య
భూమిని గార్గేయ పుణ్యాశ్రమమునఁ
దనరు దేవరకొండ౨; దాని దాపునను
బుర మొకం డోరూరు౩ పొల్చు; నాపురిని
వెలయు నందవరీక విప్రోత్తముండు
త్యాగశీలుం డనందగు ధాకరాజు
అతని సాధ్వి మేళమ్మ; వారలకు
చాడేశ్వరీ కృపాసంయోగకలనఁ
బొడమెఁ దేజశ్శాలి పుత్త్రుడొక్కండు;
చిక్కన నా నొప్పి చెల్వారె నిసుఁగు;

ఆసిసు వొదలిన యనతికాలమున
నతులదయాన్వితుం డగు ధాకరాజు
దైవయోగంబునఁ దనువుచాలించె;
'నిష్ప్రచ్ఛరములకు నెలవు తానౌచు;
బెడఁదల కెల్లను బెనువిత్తు నవుచు,
జనకుని గండానఁ దనయుండు పుట్టె;
నని జనపదులు భావనచేయుచుండ

నాస్తిపాస్తులు చెడె; నంత మేళమ్మ
యష్టకష్టమ్ముల నంది యోరూర
మనుగడ దొరలించు మార్గంబు గనక,
యా పల్లెవాసి సీమాంతర మరుగఁ
దలపోసి, యెడఁద నుత్తలపాటు గదురఁ
చిన్నవానిని గొని భిక్షాటనమున
నూరూరుఁ గడచి, కొండొకకాలమునకు —
తుంగభద్రానదీ తోయంబు వలన
నతిపవిత్రంబయి యలరెడుదానిఁ
బంపాప్రసాద సద్భాగ్యంపుఁ గల్మి
ననుపమ వైభవం బందెడుదాని
శ్రీవిరూపాక్షుని దృగ్విలాసముల
నున్నత శోభన లొందెడుదాని
ఋశ్యమూకాది భూభృద్రాజపఙ్క్తి
నరివీరరతతి కభేద్యంబైనదాని
శ్రీ బుక్కరాయు నుద్ధృత భుజాపటిమ
ననపాయగరిమఁ జెంపారెడుదాని
నఖిలవేళల మహోద్యత్కార్యరచన
కిరవయి విజయమందిరమగుదానిఁ
గరశిల్ప సాహిత్య గాన యోగాది
కళలకు నిలయమై విలసిల్లుదాని
నేప్రొద్దుఁ దన్నాశ్రయించు దీనులకు
నార్తుల కభయదాయకమైన దాని
విద్యాపురంబన విఖ్యాతిఁ గనిన
స్థానీయమును జొచ్చి, చక్రతీర్థంబు
నందుఁ గోదండరామాలయ వేది
నిలిచి, యిప్పటికగు నెల లిదెయంచుఁ
దలఁచి, యాజోగీల తలిమంబుగాఁగఁ
గూర్కొడి నుతువీడి, కొందలపడుచు
నరిగె భిక్షుకు నగరాంతరవీథి.

(సశేషము)

౧. క్రీ. శ. ౧౩౪౬ — ౧౩౪౯ ప్రాంతమున సాగిన చరిత్రమిది. అనంతసాగర — బుక్కరాయ సముద్రముల కైఫీయత్తు దీనికి నంకురప్రాయము.

౨. అనంతపురమునకుఁ దూరపు దెస నొకపరువు (కోసు) దూరమందుండు కొండ — దేవరకొండ.

౩. ఈ గ్రామ మిపు డగపడదు. దేవరకొండకుఁ బడమర నరమైలు దవ్వున నీ గ్రామముండెనని కైఫీయత్తు నుడువుచున్నది. ఆ కొండకుఁ బశ్చిమమున, దాని శాఖయగు నల్లగుట్టకుఁ దూర్పుటోరను సమతలమున, ఓరూరు పేర నొక పురముండెననుట తత్ప్రాంతవాసుల యభిప్రాయము. తత్సమతలము నందలి 'కొండక్రింది చేలం' కర్షకులు సేద్యమునకై దున్నినపుడు నేలనుండి పురాతననిర్మాణముల మట్టియుఁ, బనఁటలు (కుండలు), బూడిదయు వెలువడుచుండునఁట! వానికి నాధారమైన యా పల్లె (ఓరూరు) కాలగర్భమునఁ గరఁగియుండనోపు!

(434 వ-పేజి తరువాయి)

శాంతియుత మార్గాలలో అన్యాయాన్ని, అక్రమాన్ని ఎదిరించి, నిజాయితీ, ఆత్మ బలంతో ఆశయలక్ష్యాల సిద్ధికి పూనుకోవాలి. బాలబాలికలకు చిన్నప్పటినుండియే సమానత్వ ప్రాతిపదికమీద పరస్పరం గౌరవించుకుంటూ సద్గుణాలతో మెలగడం నేర్పబడాలి.

అధ్యక్షత వహించిన శ్రీమతి ఇందిరాగాంధీ ఉపన్యాసములో యీనాడు జాతీయ రంగంలోని అనైక్యత, పరస్పర విరుద్ధభావాలు, వర్గపోరాటాలు దేశాన్ని బలహీనం చేస్తున్నవంటూ అట్టి లోపాలను స్త్రీలు సరిదిద్దాలన్నారు.

శీలవంతులనుగా చేయువానిలో విద్యయొకటి. స్త్రీలు విద్యావంతులగుటతో పాటు శీలవంతులయినచో తమ పిల్లలు విద్యావిజ్ఞానములతో పాటు సత్శీలమునుకూడ కలిగియుండెదరు. నేడు పిల్లలకు స్త్రీలు రక్షకులైతే, భవిష్యత్తులో దేశానికి పిల్లలు రక్షణ కావలసినవారు. స్త్రీలు విద్యావిజ్ఞానము లార్జించుటలో సాధారణ గృహనిర్వహణ విధులను నిర్వహించుటను నేర్చుకోవాలి! ఇట్టి శిక్షణలేనినాడు కుటుంబంలోను సంఘంలోను సుఖసౌభాగ్యములు లోపించును. స్త్రీలకయినా, పురుషులకయినా అనాలోచిత కోపతాపాలు క్షేమకరం కానేరవు. కాబట్టి గృహనిర్వహణ విధులలో సయితము స్త్రీ పురుషులు పరస్పర సానుభూతి సద్భావాలు కలిగియుండాలి.

జాతీయ రంగంలోనేకాక అంతర్జాతీయ రంగంలో సయితము స్త్రీలు కీర్తి ప్రతిష్టల నార్జించుటకు ఓర్పు, త్యాగసేవాసక్తి, సువిశాల ఉదార్హ హృదయములాంటి సుగుణాలు విశేషంగా తోడ్పడగలవు.

(440వ-పేజీ తరువాయి)

పో:_(తడబడుతూ) రోడ్డుమీద – కాదండీ! ఆఫీసు సింహద్వారం దగ్గర.

న్యా:_సరే - రేపటికి వాయిదా వేశాను విచారణను. (న్యాయమూర్తి లేవగానే అందరు లేచెదరు.)

◆ ◆ ◆

(వకీలు రాఘవరావుగారి యింట్లో మణి నిద్ర పోతుంటుంది. అందులో కల – అందలి దృశ్యాలు - పోలీసులు రాజయ్యను చేతులకు బేడీలు తగిలించి పట్టుకపోతుంటారు.)

నాగ:-(ఏడుస్తూ పరుగెత్తిపోయి) అయ్యో! అయ్యా! మా అయ్యనెందుకు పట్టుకెళుతున్నారు? వదలిపెట్టండి బాబుల్లారా!

పోలీసు:-వీడిని వదలిపెట్టాలా! దొంగ వెధవ!

నాగ:-మా అయ్యను దొంగ అంటారేమిటి?

పో:_అయితే నేనా దొంగను?

నాగ:-కాదు బాబూ! ఆయన మంచివాడు.

పో:-సరేలే! ఆయన మంచితనం కనుపిస్తూనే యున్నది _ పద నడువు ముందుకు (రాజయ్యను ముందుకు నెడతాడు.)

నాగ:-అయ్యో! నన్ను నాధగా చేసి వెళ్ళిపోతున్నావా? నాకింకెవరు దిక్కు_ (పలవరిస్తుంటుంది).

లక్ష్మమ్మ:-మణీ! మణీ! ఏమిటీ కలవరింతలు? (చేత్తో తట్టి లేపుతుంది.)

నాగ:_(లేచి కూర్చొని దిక్కుముఖంతో) అమ్మగారూ! మా అయ్యను పోలీసులు లాక్కొని పోతున్నారు. ఆయన కెవ్వరు సహాయం చేసిన వారు లేరు.

ల:_పిచ్చిపిల్లా! కల ఏదో వచ్చిందని యింత గొడవ చేస్తున్నావేమిటి! కండ్లు మూసుకొని పడుకో!

(మణి ఎప్పటియట్లు పడుకుంది.)

◆ ◆ ◆

(పోలీస్ స్టేషన్‌లో ఇన్స్‌పెక్టర్ టెలిఫోన్ రిసీవర్ చెవిలో నుంచుకొని మాట్లాడు తుంటాడు.)

ఇన్స్:-హల్లో! అవును. మీరేనా బ్యాంకు మేనేజరు?...అ...అలాగా!...ఉదయమేనా చూచి కనిపెట్టారు?...మంచిది...దొంగ పట్టుబడ్డాడు. కేసుపెట్టి విచారణ జరుగుతున్నది. రేపు ఉదయం మీరు కోర్టుకు హాజరుకావాలి...మంచిది.

◆ ◆ ◆

(రాఘవులు తన యింటి పంచలో మంచము మీద కూర్చొనియుంటాడు. ఇన్స్‌పెక్టరు రాకచూచి లేచి కుర్చీ తెచ్చివేసి కూర్చొ పెడతాడు.)

రాఘు:-ఏదో పనిమీద వచ్చినట్లున్నది ఇన్స్‌పెక్టర్ గారు.

ఇన్స్:-నీతో మాట్లాడలనే వచ్చాను.

రాఘు:_ఏమిటీ! ఏమీ తలకు చుట్టుకదా! పోలీసు వారితో స్నేహం ప్రమాదం బాబూ!

ఇన్స్:_అదేమి లేదులే రాఘవులూ! నేను పోలీస్ యిన్స్‌పెక్టర్ని, నీ స్నేహితుణ్ణి.

రా:_అదేమిటండీ! యిందులో క్రొత్త ఏముందీ!

ఇన్స్:_బ్యాంకిలో దోపిడి చేసినవాడు సామాన్యమైన వాడు కాడు.

రా:-మీరు పూర్తిగా పొరబడుతున్నారు. అతడు ఏనాటికి దొంగ కాడు. అతడు కల్లకపటములేని పేదవాడని అతని వాలకమే చెప్తున్నది. వాడు దొంగ కాదు; దొంగిలించడం తెలియదు.

ఇన్స్:_రాఘవులూ! పోలీస్ యిన్స్‌పెక్టరుగా నీ కంటె నాకుగల అనుభవం దొడ్డది. ఇలాటి దొంగలను, జాదగాండ్రను, త్రాగుబోతులను, తిరుగుబోతులను, హంతకులను ఎందరినో కనిపెట్టి న్యాయస్థానాలలో నిలబెట్టియున్నానని తెలుసుకో! ప్రత్యక్షంగా డబ్బు సంచులతో వీడు పట్టుబడితే దొంగయని రుజావు కావడానికి మరేం ఆధారం కావాలి?

రా:_నిజమయి యుండవచ్చు. న్యాయప్రకారము శిక్షించిన నేరస్తులు బహుకొద్దిమంది యుంటారని నా యూహ. అతని చేతులలో డబ్బు సంచులు దొరికినమాట నిజమేనని నాకు తెలుసు. అతడు దొంగిలించేటప్పుడో, దొంగిలించుకొని వచ్చేటప్పుడో చూచి పట్టుకున్నవారెవరు? ఎవరూ లేరు. "దొంగ, దొంగ" అనే అరుపులు విని జనం గుమికూడారు. దొంగిలించుకొని పోయేవాడు ఎవడైనా అరచి జనులను కూరుస్తాడా! ఆలోచించండి బాగా.

(సశేషము)

# అపోహ

శ్రీ పి. తిరుపతిరావు



చల్లని సాయంత్రం – పూలచెట్లు నెమ్మదిగా తల లూపుతున్నాయి. పక్షులు ఆ కొమ్మనుండి ఈ కొమ్మకు ఎగురుతూ నృత్యం చేస్తున్నాయి. పూల మొక్కల మధ్య వాలుకుర్చీలో ఇరవై రెండేండ్ల శకుంతల మనస్సు హత్తుకపోయో "అన్నా కెరినినా" చదువుతుంటే, పుస్తక భాషలోని భావాలకు ఆమె ముఖంలో అనేక భావాలు మారుతున్నాయి. ఆమె వంపుసొంపులను కప్పే జార్జెట్ చీర గాలికి రెపరెప లాడుతూ కాటుక కళ్ళతో పుస్తకాన్ని దీక్షగా చదువుతుంది.

శకుంతల స్నేహితురాలు, భారతి వచ్చి కుర్చీ వెనుకగా నిలబడివుంది. శకుంతల పుస్తకాన్ని తప్ప ఇతర ప్రకృతిని మరచిపోయింది. భారతి నెమ్మదిగా గొంతు సవరించుకొంది. శకుంతల ఉలిక్కిపడి "ఎవరు?" భారతా, కూర్చో అంటూ కుర్చీ చూపించింది. కాని భారతి, కుర్చీలో కూర్చోలేదు. మాట్లాడలేదు.

"పరధ్యానంలో పడి మరచిపోయాను. కోపం వచ్చిందా?" భారతి మాట్లాడలేదు.

'ఏమిటి భారతి రోజూ కలకలలాడుతుండే దానివి, నీ ముఖంలో మానం గూడు కట్టుకొంది. నే నేమైనా నిన్ను నొప్పించానా!' భారతి మౌనంగా ముఖంలో ఏ ఉద్వేగం కనిపించనీయకుండా చేతిలో వున్న మడతపెట్టిన కాగితాన్ని 'టీ' పాయ్‌మీద పెట్టి చరచరా నడచి వెళ్ళిపోయింది. శకుంతల నిశ్చేష్టురాలయింది. ఏమిటీ భారతి వింతప్రవర్తన – తనకు స్నేహితురాలేగాక, తనకు వదిన కాబోతుందే? ఏమిటి వింతధోరణి అనుకుంటూ 'టీ' పాయ్‌మీద వున్న వుత్తరాన్ని తీసుకొని చదవసాగింది.

ప్రియశకుంతల, విధి సరిగ్గా మాస్తే నన్ను వదినా అని పిల్చేదానివి. ఈనాడు తోడులేకుండా, ఒంటరిగా ఎందుకొచ్చాననుకుంటున్నావ్ కదూ! హృదయాన్ని రాయి చేసుకొని నీవద్దకు రాకూడదనుకున్నాను. ఇప్పుడు కాకపోయినా పెండ్లయిన తర్వాతనైనా నీ దగ్గరకు రాకతప్పదు.

ఓకనాడు నా హృదయ విషాదంలో ఆశలతోరం చుట్టుకొని – ఊహలు పువ్వు పొంగులంగా చిగురించబోయాయి. ఆనాడు మీ అన్న శ్రీపతిని కలుసుకోనకుండా వుంటే ఇట్లా బాధపడేదాన్ని కాదేమో! భవిష్యత్తు మాదేనని భ్రమించి – ఆనందానందంతో అంతరాంగడోలికల్లో సోలిపోవాలని – జీవితలోతుల్లో దిగి – మధురస్వప్నాలను గాంచాలని ఉవ్విళ్లూరాను.

కాని ఆ లోతులు - అగాధాలని నేడు అనుభవలసి వచ్చింది శకుంతల. నా ఆశలు తెగిన గాలిపటాల్లా, చిన్నపిల్లల పిచ్చుక ఇసక గూళ్లులా అయ్యాయి.

"నా ధోరణి నీకు అర్థరహితంగా కనిపిస్తుంది కదూ? నిజమే." నిజంగా నా జీవితంలో- ఎన్నడు ఇట్లు జరుగుతుందని అనుకోని సంఘటన జరగబోతుంది. దానికి కారణం ఎవ్వరనేది–అప్రస్తుతం– నా విధివిలాసం – కర్మ-అంతే.

నీకు వయస్సు వచ్చేనాటికి - మీ తల్లిగారు పసుపుకుంకంతో ఈ లోకం విడిచిపెట్టింది. ఈనాడు మీ నాన్నగారిది ఒంటరి జీవితం.

గతంలో నన్ను నీకు వదిన కావాలని ఎక్కిరించేదానివి. ఆ భాగ్యం నేను నోచుకోలేదు శకుంతల. నీకు వదినగా రావలసిన నేను తల్లిగా రాబోతున్నాను.

"ఏం? నీకు ఆశ్చర్యంగా వుందా?"

నన్ను అసహ్యించుకుంటావని తెలుసు. ఆ సంగతి నాకు తెలిసికూడా, గుండెల్లో గునపాలతో పొడుస్తున్నట్లున్నా - ఇక నాకు వేరే మార్గంలేదు. నా కన్నీటిగాథ నీకు తెలియజేస్తే - గుండెల్లో భారం తగ్గుతుందని – అపార్థం చేసుకోవని ఈ వుత్తరాన్ని రాయగలిగాను.

"పాతిక సంవత్సరాల బీదయువకుని కంటే – అరవై సంవత్సరాల ధనంవున్న - వృద్ధుడే నయం" అన్న మా నాన్నగారి అభిప్రాయంతో ఏకీభవించక తప్పలేదు. వాటికి కారణం - బీద నికృష్టపు కుటుంబంలో పుట్టడమే, నే చేసిన పాపం.

"ఏకీభవించకపోతే!"... నా బ్రతుకు శాఖాగ్రంలో విషాదం అనే విషంతో నిండిన - విధి అనే కాల నాగు కాటు వేయడానికి సిద్ధంగా వుంది.

"ధన పిశాచికి నా సౌభాగ్యాన్ని తాకట్టు పెడు తున్నారు." తాకట్టు పెట్టకపోతే, ఆర్థికంగా మా కుటుంబం పతనమయి పైగా పైకి రావలసిన చిన్న వాళ్ళ జీవితాల్ని మొదలంట నరకిన దాన్నవుతాను శకుంతల.

"నేను హృదయం — నీతిలేని రాతిగుండెరాల వని అంటావ్? జీవితంలో ఆశల్ని లేపి - వాటికొక స్వరూపం యివ్వలేక - బ్రతుకును గతుకు రహదారి చేసి - అనురాగాల్ని అధఃపాతాళంలోకి శాశ్వతంగా సమాధిచేసి చేతులు కడుక్కొన్న మీ అన్నగారు శ్రీపతిదా? రాతిగుండె! నాదా? నేను లేకపోతే - తాను జీవించలేనని — నేనే సమస్తమని — ఆఖరి ప్రేమలేఖ — సేకపోతు గాంభీర్యంగా వ్రాశాడు.

బహుశ శ్రీపతిగారి దృష్టిలో — పురుషులు స్త్రీని నమ్మించి, దేశోద్ధారకునిలా కబుర్లతో ఉద్ధరించే విధానం - సంస్కరణ ఇదే కాబోలు.

"ఇప్పుడు చెప్పు శకు... ఎవరిది? పాషాణ హృదయం! యిప్పటికైనా నా యదార్థాన్ని గ్రహిస్తే, కనికరం చూపిస్తావని నమ్మకం నాకుంది.

శ్రీపతి రాసిన వుత్తరంలో వున్న ఒక్కమాట — ఆఖరి క్షణంలో మీ తండ్రి ఎదుట అనివుంటే, నా జీవితయానం, మరొకవిధంగా పయనించేదేమో? ప్రణయమూర్తిగా ఆరాధిస్తూన్న శ్రీపతిని. కొడుకుగా ఎట్లా పిలవను? ప్రేమించిన పడతిని పరిణయమాడతా నని చెప్పలేని బలహీనుడు — శ్రీపతి యింటికి తల్లిగా ఎట్లా రావడం?

"సుడిగాలికి తెరచాప ఎత్తిన పడవ — పడిలేచే కడలి తరంగంలా వుంది."

చివరకు "మీకు తల్లిగా" — మీ తండ్రికి 'భార్యగా' వెళ్ళడానికే నిశ్చయించుకొన్నాను.

"గత్యంతరంలేక! పతనమయ్యే మా కుటుంబాన్ని కళ్ళారా చూస్తూ సహించలేక... భవిష్యత్తు భగవంతుడే నిర్ణయించాలి.

నాకొకప్పుడు వాగ్దానం యిచ్చావ్. నా పెండ్లి ఎక్కడ జరిగినా, వస్తానన్న నీ వాగ్దానం. పెండ్లికి వేసిన పచ్చని తోరణాల పందిరిలో - నా నొసటన పెట్టే ఎర్రని తిలకాన్ని అన్నా-చెల్లెలు ఆనందించ డానికి మీ యింటివద్దే పెండ్లి జరుగుతుంది. నా బాధ — బ్రతుకుసొద ఆ బాజాబజంత్రీల సమ్మేళ నంలో మోడు వినిపించవులే! నా పసుపుకుంకుమ పది కాలాలపాటు నిలవాలని, పచ్చని పందిరిలో కూతురుగా వచ్చి — కాబోయే ఈ చిన్నారి తల్లిని దీవించుతావని నీ వాగ్దానాన్ని నిలబెట్టుతావని తలుస్తాను."

ఇట్లు
అభాగ్యవతి
"భారతి"

వుత్తరం చదువుతూన్నప్పుడూ శకుంతల కళ్ళలో నీళ్ళు తిరిగాయి. వుత్తరం మసకమసకగా కనిపిస్తుంది. పైటచెంగుతో కళ్ళను తుడుచుకొంటుండగా, వాలు జడలో నలంకరించుకున్న గులాబిపూవు విచారంలో వడిలో పడి వడిలిపోయింది. ఆపుకుందామని ఎంత ప్రయత్నించినా, రెండు కన్నీటి చుక్కలు చెక్కిళ్ళ క్రిందగా జారి — చంటిపిల్లలా ఏడ్వసాగింది శకుంతల.

"తన కొడుకు భవిష్యత్తుకోసే తండ్రి ప్రవర్తన పట్ల — ఆమె పెదవులు అసహ్యంగా కంపించాయి!" దీనిలో ఏదో మోసం వుంది! వయస్సు ముదిరిన ముసలితండ్రికా పెండ్లి! ఇప్పుడే బయలుదేరి తండ్రిని అడిగి — చనిపోయిన తల్లికి — అపచారం జరుగకుండా చూడాలి! భారతిని రక్షించాలి! అన్న శ్రీపతి చేతకానితనానికి లోలోపల సిగ్గుపడింది.

పుట్టిల్లు - అత్తవారిల్లు — ఒక్కేవూరు కావడం మూలాన్న — అత్తగారితో చెప్పి, భర్తను తోడు తీసుకొని అరగంటలో పుట్టిల్లు చేరింది. అక్కొస్తుందే! అని అరుస్తూ దగ్గరకొచ్చిన తమ్ముణ్ణి ఎత్తుకొని ఇంట్లోకి వెళ్ళింది —

సన్నగా — మధురంగా — సితార్ ధ్వనులు మేడ పైనుండి వినవస్తున్నాయి — అన్నయ్య పైనే వున్నా డని కోపంతో, శబ్దంతో మెట్లెక్కి పైకి వెళ్ళి, అప్పుడే ఉదయిస్తున్న తారలను కిటికీలోంచి చూస్తూ - సితార్‌మీద హాయిగా వ్రేళ్ళను ఆడిస్తూన్న శ్రీపతిని చురచురా చూచింది.

"అన్నయ్యా!" అని అరచింది శకుంతల.

శ్రీపతి ఉలిక్కిపడి అటు తిరిగాడు - "యిప్పుడేనా రావడం? ఏమిటో అంత కొంపలంటుకొన్న పని" అన్నాడు నవ్వుతూ.

"కొంపలంటుకొని — ఆ మంటల్లో కొందరి బ్రతుకులు దగ్ధమౌతున్నాయ్ నీవల్ల".

"నావల్లా!" ఆమె మాటకు నిర్ఘాంతపోయాడు. సితార్ భయంకరంగా మ్రోగి తీగ తెగిపోయింది.

"ఆఁ నీవల్లే! ఈ వుత్తరాన్ని చదువు" అంటూ శ్రీపతి చేతికి వుత్తరాన్నిచ్చింది శకుంతల. శ్రీపతి కళ్లు, ఉత్తరంలో ప్రతి పంక్తిని తదేకంగా చూస్తున్నాయ్. ప్రతి క్షణానికి మారుతున్న భావముద్రలని తదేకంగా గమనిస్తుంది శకుంతల. శ్రీపతి ముఖం వాడిపోయింది. వణికే వ్రేళ్లతో ఉత్తరాన్ని గట్టిగా పట్టుకొని గాయపడిన జంతువులా బాధపడసాగాడు. ముఖం ప్రక్కకు తిప్పుకొన్నాడు.

"ముఖం అట్లా పెట్టావేం! నమ్మించి నాశనం చెయ్యడం తెలుసు. పైగా ఆడదానిలా ఏడు పెందు"కన్న శకుంతల మాటలకు, శ్రీపతి ఆవేశాన్ని ఆపుచేసుకోలేక అదిరే పెదవులతో ఏదో చెప్ప బోయి - చెప్పలేక — బోనులోని సింహంలా అటూ ఇటూ తిరిగి కిటికీ ప్రక్కకు వెళ్ళి —

"ఈ వుత్తరాన్ని నమ్మలేకపోతున్నాను చెల్లీ! శ్రీపతి మాటల్లో స్వరం గాద్గదికమైంది. చెల్లీ. ఈ వుత్తరం నా గుండెల్ని అదకత్తెరలో ఎవరో నొక్కుతున్నట్లుగా వుంది. భారతిచ్చిన వాగ్దానం కాదన లేదు. నాన్న నా జీవితంలో గారుచిచ్చు పెడతాడని ఊహించుకోలేకపోయాను. నామాట నమ్ము చెల్లీ."

"అన్నాయ్! నన్నెందుకు నమ్మించాలని ప్రయత్నిస్తావ్ — నీవు భారతిని ప్రేమించడం, నిజమను కొన్నాను కాని, మోసకారివని తెలిస్తే — నీ గుట్టు బట్టబయలుచేసి-ఆమెను నాశనంకాకుండా కాపాడే దానిని. నీ అన్న యిటువంటివాడంటే — ఆమె ముందు ఎట్లా తలెత్తడం చెప్పు-భారతి ఈ యింటికి తల్లిగా వచ్చి, ముద్దుముచ్చటలు తీరకముందే — ఉరి పోసుకొని చచ్చిన తర్వాత తెలుస్తుందన్న శకుంతల మాటలకు — శ్రీపతి ఒక్కసారి బిగ్గరగా "చెల్లీ, నన్నింతకాలం అన్నగా అర్థం చేసుకుంది ఇంతేనా? భారతిని నా హృదయరాణిగా చేసుకొని — నా బ్రతుకంతా ఆమె సన్నిధిలో గడపాలని, కలలు గన్న నేను ఆమెను నానుండి ఎట్లా దూరం చేసుకోవాలి? తల్లిగా స్వీకరించి ఆమె బ్రతుకును దగ్ధం చెయ్యలేను. అయ్యో భగవంతుడా! నన్నింత పనికి మాలినవాడిగా — మోసకారిగా చిత్రించావేమిటీ?" అంటూ వలవలా ఏడ్వసాగాడు. బాధతో మనిషి మెలితిరిగిపోయాడు. అతను పొందే బాధలోని జాలి, శకుంతలను తిరిగి నోరెత్తనీయకుండా చేశాయి.

"ఏమోయ్, సుబ్బారావ్ - అమ్మాయి కూడా వచ్చిందా? అన్న తండ్రి మాటకు - పైనవున్న — శ్రీపతి, శకుంతల గుండెలు గతుక్కుమన్నాయ్. ఒక్కొక్క మెట్టు ఎక్కుతున్న శబ్దం యిద్దరిని కలవర పరిచింది. ఏదో చెయ్యాలని వచ్చిన శకుంతల — తండ్రితో అటో యిటో తేల్చుకోవాలనుకొన్న శ్రీపతికి, తండ్రి రాక యిద్దరి గుండెల్లో రైళ్ళు పరుగెత్తుతున్నట్లనిపించింది.

అల్లుడు సుబ్బారావ్‌తో పైకివచ్చిన బసవరాజుకు వారిద్దరి పరిస్థితి అర్థంకాలేదు. ఏరా! శ్రీపతి బావొస్తే మంచి చెడ్డ చూడకుండా ఇక్కడే వుండిపోయావ్ — అలా కూర్చోవోయ్ సుబ్బారావ్ — ఏమిటీ విశేషాలు!

"సమాధానం శూన్యం" అన్నా చెల్లెలిద్దరూ ఒకరి మొహాలు ఒకరు చూచుకుంటున్నారు.

"ఏంలేదు నాన్నా."...

"ఏం లేకపోవడమేమిటి; నువ్వు చెప్పమ్మా." శకుంతల కూడా మౌనం వహించింది.

(సశేషము)



హిందీతార మిస్ మినూముంతాజ్

# స్వీకారము

భారతదేశానికి అమెరికా సహాయాన్ని అంకెల వివరాలతో సచిత్రంగా చూపు 'భారతాభ్యుదయం' మా కార్యాలయమునకు చేరింది. ఇందులోని చిత్రాల నన్నిటిని యీ గ్రంథానికనే ప్రత్యేకంగా శ్రీ రిఛర్డు శిసాయ్ తీశారు.

భారతదేశపు అభ్యుదయ అభివృద్ధుల దృష్ట్యా పంచవర్ష ప్రణాళికల నిర్వహణకు అమెరికావారు చేయుచున్న సహాయము, మనదేశం పురోభివృద్ధిపట్ల అమెరికన్ ప్రజలు, ప్రభుత్వము చూపుతున్న ఆసక్తి ఆకర్షణీయంగాను, సచిత్రంగాను వివరించబడినవి. ఇది యునైటెడ్ స్టేట్స్ ఇన్‌ఫర్మేషన్ సర్వీస్, (మద్రాసు) వారి ప్రచురణ.

♦ ♦ ♦ ♦

**ఊరుభంగము (దుర్యోధనుని నిర్యాణము): శ్రీ స్వామి జాలయ్య. ప్రచురణకర్తలు - విజ్ఞానజ్వాలా ప్రచురణములు, శ్రీనికేతన్, 12-బి, పటేల్ రోడ్డు, పెరంబూరు, మద్రాసు-11. వెల 50 న. పైసలు.**

ఈ చిన్న వచనకావ్యము భాసుని సంస్కృత నాటకం ఆధారము చేసికొని రచింపబడ్డది. లోగడ యీ నాటకాన్ని శ్రీ వేదం వేంకటకృష్ణశర్మగారు అనువదించారు. ఈ గద్యకావ్యములోని రచన సుబోధంగాను, ముచ్చటగా నున్నది. బాలబాలికలకు మన సారస్వతములోని ప్రసిద్ధ నాటకాలు, కావ్యాలు యీ విధంగా సరళశైలిలో బయలువెడలవలసిన అవసరము ఎంతైనా కలదు. దాన్ని అవగాహన చేసికొని శ్రీ జాలయ్య శెట్టిగారిట్టి ఉద్యమానికి పూనుకొనుట తెలుగువారి భాగ్యవిశేషమని చెప్పాలి. ముఖ్యంగా పాఠశాలలలో దీనిని ఉపవాచకముగా విద్యాభిమానులు నిర్ణయించి యిట్టి గ్రంథాలను వ్రాయుటకు శ్రీ జాలయ్యగారిని ప్రోత్సహించగలరని మా విశ్వాసము.

**వ్యాసమంజరి : విద్వాన్ కే. సంజీవరాయశర్మగారు. ప్రతులకు - ఉదయరంజనీ పబ్లిషర్స్, 66, సామిపిళ్లై వీధి, చూళై, మద్రాసు-7. వెల 1 రూపాయి.**

ఈ పుస్తకము హైయర్ ఎలిమెంటరీ, మాధ్యమిక పాఠశాలలలో చదువు విద్యార్థుల వ్యాసరచనాభ్యాసమునకు, విజ్ఞానమభివృద్ధి చేసికొనుట కనువుగా రచింపబడినది. విద్యాలయములందలి సారస్వత సంఘ సమావేశ చర్చలలో సయితము పాల్గొనుటకు మార్గదర్శకముగా నుండునట్లు విషయములు కూర్చబడినవి. ఈ పుస్తకమును అందలి విషయముల వల్లించుటకేకాక స్వయముగా విషయపరిజ్ఞానముతో ఉత్తమ రచయితలుగాను, వక్తలుగాను రూపొందుటకు విద్యార్థులుపయోగించుకొనగును.

# సంపాదకీయములు

## శ్రీ ఫిరోజ్ గాంధీ నిర్యాణము

ఇండియా పార్లమెంటులో నిర్మాణాత్మకమైన విమర్శనలతోటి, సూచనలతోటి ప్రభుత్వ నిర్వహణకు తోడ్పడినవాడు శ్రీ ఫిరోజ్ గాంధీ. ఆయన చిత్తశుద్ధి, జాతీయ పునర్నిర్మాణముపట్ల ఆసక్తి ఆయన మాటల లోను, చేతలలోను ప్రతిఫలిస్తుండేవి. పార్లమెంటేరియన్‌గా ఆయన ఆదర్శనీయుడు.

శ్రీ ఫిరోజ్ గాంధీ విమర్శలు, సూచనలు విశాల భావములతో కూడినవి. వర్గరాజకీయములకు గాని, సంకుచిత తత్త్వములకు గాని అతీతములు. దేశభక్తుడు, ప్రజల సమస్యలను సానుభూతి సద్భావములతో పరిష్కరించడానికి, వారి సుఖసౌభాగ్యములను తీర్చి దిద్దుటకు ప్రతి విషయము ఆసక్తి చూపినట్టివాడు.

జాతీయ, అంతర్జాతీయ సమస్యల సందర్భమున సయితము శ్రీ ఫిరోజ్ గాంధీ విమర్శలు, సూచనలు అమూల్యములు, అనుసరణీయములుగా నుంటుండేవి. కాబట్టి ఉభయ పార్లమెంటులలోను, దేశం మొత్తం మీద ఆయనపట్ల గౌరవమర్యాదలు విశేషంగా పెచ్చుపెరిగినవి. ఈయన మరణం దేశానికి విశేషమైన నష్టమును కలిగించినది.

భర్తను కోల్పోయిన శ్రీమతి ఇందిరా గాంధీకి, కుమారులకు, కుటుంబములోని యితరులకు మా సాను భూతి తెలుపుచున్నాము.

## మహిళా సంక్షేమం - పంచాయతి సమితులు

పంచవర్ష ప్రణాళిక ననుసరించి జరుగుచున్న మహిళా సంక్షేమ కార్యకలాపాల నిర్వహణను పంచా యతి సమితులకు ఒప్పగించ పూనుకున్నట్లు వార్త.

పంచాయతి సమితుల నిర్మాణమే పరస్పర సద్భావపూరితమయిన వాతావరణంలో జరుగలేదు. ప్రజలైనా బాధ్యతాయుతంగా తమ హక్కులను, అవకాశములను గుర్తించి వ్యవహరించే స్థాయిసయితం కనుపించనప్పుడు సంక్షేమ కార్యకలాపాలలాంటి గురుతర బాధ్యతలను చిత్తశుద్ధితో, నిష్పాక్షికమైన ధోరణిలో ఏమాత్రం నిర్వహించ కలుగగలవో పంచాయతులు చూడవలసియున్నవి.

## ఆంధ్రదేశం - కరువు కాటకాలు

ఆంధ్రదేశంలో సకాలంగా వర్షాలు లేక కరువు కాటకాలు ఏర్పడ్డాయి. త్రాగుటకు సయితము నీళ్లులేవు సరికదా పైర్లు మలమల మాడిపోతున్నవని వార్తలు. మూలిగే నక్కమీద తాటికాయ పడ్డదన్నట్లు విపరీతంగా జీవితావసరములైన కూడు, గుడ్డలాంటి ధరవరలు పెరిగిపోతుంటే ప్రజలు గిజగిజలాడుతున్నారు. ఉత్పత్తిదారులకు, వినియోగదారులకు, ప్రభుత్వ నిర్వాహకులకు పరస్పర సద్భావ, సానుభూతి సహకారాలు లేక కొంత, చాలినంత ఉత్పత్తులు లేక కొంత ఆర్థికదుస్థితి మరింత గడ్డగుచున్నది. ఈ పరిస్థితులలో మన ఆంధ్రదేశం కొంత భాగం కరువు కాటకాలకు గురియయినదంటే విషాదకరం. ప్రభుత్వము కరువు నివారణ కార్యక్రమాలకు చేయకలిగినంత చేయూతలపెట్టినా ప్రజలు సయితము ఆత్మవిశ్వాసంతో సంఘంలో ఐక్యతను, దీక్షాయుతమైన కృషిని పెంపుచేసికొని ప్రస్తుత క్లిష్టపరిస్థితులనుండి తప్పించుకోడానికి మార్గాల నన్వేషించాలి.

---

Printed & Published by Dr. S. Seshagiri Rao at Lodhra Press, Kesari Kuteeram (Private) Ltd. 15, Westcott Road, Royapettah, Madras. Editor : C. C. Punniah. Proprietors : Kesari Kuteeram (Private) Ltd.

